అభ్యుదయ ప్రచురణ నెం. 3

# "అభ్యుదయం"

( సాంఘిక నాటకం )

రచన


శ్రీ భరద్వాజ

( శ్రీ ఈ. జగన్నాథాచారి





ప్రకాశకులు :

అభ్యుదయ కళాసమితి

అనంతపురం.

ఆజన్మాంతమూ అవిరళ కృషిచేసి అకుంఠిత దీక్షతో
ప్రజాసేవ యొనర్చి తుదకు ప్రజలకోసమని
ఆత్మబలిదాన మొసగిన మహాత్మా
గాంధీజీ దివ్య పాదారవిం
దములందు సమర్పితము.

# నా మాట.

జాతిపిత గాంధిజీ కలలుగన్న శ్రేయోరాజ్య స్థాపనకు ప్రథమ సోపానంగా పంచాయతీరాజ్యం ఏర్పడింది. రాజకీయ రంగంలోనేగాక ఆర్థిక సాంఘిక, వైజ్ఞానిక రంగాలలోకూడా ఈ పంచాయతీరాజ్యము అభివృద్ధి చెందిననాడే దేశకల్యాణం. పంచాయతీ రాజ్యస్థాపనతో దేశ సుభిక్షత చేకూరిందనుకోవడం పొరపాటేయగును. రాజకీయ రంగంలో స్వతంత్రవాయువును పీల్చగలిగిన మానవజీవితం నానాటికి దుర్భరమైపోతూంది. ప్రజలలో ప్రేమకు స్థానము లేకపోతోంది. అరిషడ్వర్గాలపై అభిమానం హెచ్చిపోతోంది. భౌతిక విన్యాసాలపై భ్రాంతి ఎక్కువౌతూంది. ఆధ్యాత్మిక చింత అణగారిపోతోంది. సత్యానికీ, ధర్మానికీ, అహింసకూ ఉనికిపట్టయి, ఇతర ప్రాక్పశ్చిమదేశాలకుకూడా తన విజ్ఞాన దీపికలను వెదజల్లగలిగిన భారతమాత నేడు అశాంతితో అల్లలాడుతోంది. ప్రజలలో పరస్పర వైషమ్యాలు ప్రబలి స్వార్థం ఎక్కువౌతూంది. ఇట్టి విషమపరిస్థితిలో, భారతీయులనందరినీ ఒక్కత్రాట నడిపించి. భారతదేశముయొక్క పురోభివృద్ధిని ప్రథమ ఆదర్శంగా పరిగణించి స్వార్థమును విస్మరించి ప్రతి మానవుడునూ తన యథాశక్తి ఈ పంచాయతీ రాజ్యముయొక్క పురోభివృద్ధికి కృషిచేయుసంకల్పమును భారతీయులలో రేకెత్తించడమే ఈ నాటకముయొక్క లక్ష్యము. ఈ లక్ష్యాన్ని అందుకోగల్గితే నా యత్నం సాఫల్యం.

అనంతపురం అభ్యుదయ కళాసమితివారి ఆదరముతో ఈ నాటకాన్ని వ్రాయగలిగాను. అభ్యుదయ కళాసమితి సభ్యులు

ఈ రూపకాన్ని ఆంధ్రప్రదేశ్‌లో అనేక జాగాలలో ప్రదర్శించి ప్రజల ఆదరాభిమానాల నందుకొన్నారు. ఆనాటి నటీనటులగు చిరంజీవులకు నా వేదోక్త ఆశీస్సులు.

ఈ నాటకరచనలో నాకు చేదోడు వాదోడుగానుండి అప్పటి కప్పుడు కావలసిన సలహాలనిస్తూ, నాకు సర్వవిధములా సహాయ పడిన నా మిత్రుడు శ్రీ పి.వి.యల్. నరసింహారావు, బి.ఏ.,బి.ఎల్; (డిస్ట్రిక్టు పబ్లిసిటీ ఆఫీసర్, అనంతపురం) వారికి నేనెంతో కృతజ్ఞుడను.

అభ్యుదయ కళాసమితి కార్యదర్శి చి॥ సత్యరంగారావు ఈ నాటక ప్రదర్శనలో ఎక్కువ శ్రద్ధాభక్తులను చూపి ప్రదర్శ నము జయప్రదముగా జరుగుటకు వలయు హంగులను తయారు చేసి, తానే స్వయముగ ముఖ్యపాత్ర నిర్వహణమొనర్చి అన్ని బాధ్యతలూ పై వేసుకొని నిర్వహించినందులకు వానికి చిరాయు రారోగ్య ఐశ్వర్యములు పరమాత్ముడు ప్రసాదించుగాక.

'రచయిత'.

2—12—59 వ తేదీన అనంతపురం జిల్లాపరిష
ప్రారంభోత్సవ సందర్భమున గౌరవనీయులు శ్రీ నీలం సంజీవ
గారి సమక్షంలో ఈ నాటకం తొలిసారిగా ప్రదర్శింపబడి ప్రశం
సంపినది.

—: నాటి నటువర్గం :—

జమీందారు:— శ్రీ జి. నరసింహదాస్, B. Sc. B. Ed.
భద్రం:— శ్రీ కె. సత్యరంగారావు
సుధాకర్:— శ్రీ డి. బి. కృష్ణారావు
సురేశ్:— శ్రీ వై. వెంకోబరావు బి. ఎ.
రాముడు:— శ్రీ ఎ. గోపీనాథ్
ప్రేమ:— కుమారి సావిత్రి
శాంతి:— ,, సుందరి.

దర్శకత్వం, పర్యవేక్షణ.
శ్రీ ఈ. జగన్నాధాచారి, బి. ఎ.

ఆర్కెష్ట్రా.
హార్మోనియం : శ్రీ నాగరాజారావు
వయలిన్ : శ్రీ అప్పారావు
తపలా : చిరంజీవి నాగముని
క్లారనెట్ : శ్రీ బి. రామన్న

నిర్వహణ.
అభ్యుదయ.

# ప్రార్థన.

ఉదయమె ఆనందం
అభ్యుదయమె ఆనందం ॥ఉద॥

స్వాతంత్ర్యభానుఁడు ఉదయించెనురా
పరతంత్రమ్మది పారిపోయెరా
తంత్రము యంత్రము మంత్రాంగమ్ములు
కనగను మనవే సరగున జూడుము ॥ఉద॥

రాజుల పాలన రాలగలిసెరా
భోగుల లాలన బుగ్గిగలసెరా
శ్రమజీవులదే శ్రేయోరాజ్యం
బంగరు పండగ భారతదేశం ॥ఉద॥

---

# మొదటి రంగము.

స్థలం:— సుధాకరుని పూరిల్లు, సమయం:— ఉదయం 5 గంటలు.

[తూర్పు దిక్కున తెల తెలవారుతుంటుంది. 'కొక్కొరోకో' అని కోడికూస్తుంది. సుప్రభాత మలయ పవనాలు వీస్తుంటవి, శాంతి పాచిపనులుచేస్తూ ఆ పనులతో శృతి కలిపి కమ్మని కంఠంతో పాట పాడుతూంటూంది. సుధాకరుఁడు నిదుర మత్తుతో అటూయిటూ పొర్లుతుంటాడు.]

శాం:— మేలుకో! మేలుకో! ఓ భరతవీరా మేలుకో!

కోడికూసెను తెల్లవారెను
గుడిసెలోనికి వెలుగు జొచ్చెను
కూడు గుడ్డకు కొరత తీరగ
నడువు ముందుకు నడుముఁకట్టుక ॥మే॥

తూర్పు దెసనదె తెల్లవారెను
మార్పులెన్నో కనగనాయెను
కల్లగాదుర కలయుగాదుర
ఒళ్లుమరచి నిదురబోకుము ॥మే॥

శాం:— (పాట పూర్తి అయిన తరువాత) అన్నయ్యా! లే అన్నయ్యా! ఒక్కసారి లేచి అట్లాచూడు. యెంత పొద్దెక్కిందో! పొద్దెక్కి నిద్దుర పోతే పుట్టెడు దరిద్రం వస్తుంది. లే!...లే!......నిన్నే!

సుధా:— అబ్బబ్బ! ఏమిటి శాంతీ యీ సణుగుడు? కమ్మగా కాసేపు నిదురన్నా పోనీయవు నన్ను!

శాంతి:— అదికాదన్నయ్యా! నీవే చెప్పు. మళ్లీ నేను జమీందారు గారింటికి వెళ్లాలా? వేళకు వెళ్లక పోతే వా ళ్లేమను కుంటారు చెప్పు?

సుధా:— అంత తొందరయితే నీవు వెళ్లిపో! ఇక్కడ యింటి పనులన్నీ నే చూసుకుంటాలే!

శాంతి:— ఛా! ఛా! ఏం మాటలవి? మగవాడివి. మగువ మాదిరి పాచి చేస్తావా? చాలుచాలు ఎవరన్నా వింటే నవ్వి పోతారు.

సుధా:— నా మగతనం మంటగలిసినట్లే వుంది. నాన్నను నానా కష్టాలూ పెట్టి S. S. L. C. దాకా వెలగ బెట్టానా? ఇక యిప్పుడేమో ఆడదానికన్నా అధ్వాన్నంగా గోళ్లు గిల్లుకుంటూ కూర్చున్నాను. ఛీ! యెందుకొచ్చిన బ్రతుకు

శాంతి:— అలా అధైర్య పడకన్నయ్యా! తప్పకుండా నీకు మంచి వుద్యోగం వస్తుంది. మన యోగం మారుతుంది.

సుధా:— మన మహారాజ యోగం కనిపిస్తూనే వుంది. Employment Exchange మెట్లు యెక్కి దిగి నాకాళ్లు అరిగి పోయాయి. ఆరు నెలలయింది. పేరు రిజిష్టరు చేయించు కొని. ఇంతవరకు అతీలేదు—గతీలేదు. అంతా అయో మయం.

[(వీధిలో Loud speaker లో రణగొణధ్వని) "నేటి సాయంకాలం మన ప్రణాళికా శాఖామాత్యులు, వారిసతీమణి మన గ్రామానికి వస్తున్నారు. పోలేరమ్మ రచ్చబండవద్ద రాత్రి 7 గంటలకు బహిరంగసభ జరుగుతుంది. అందరూ వచ్చి వారు యిచ్చే సందేశాన్ని వినాలని ప్రార్థిస్తున్నాము".]

శాంతి:— ఏమిటన్నయ్యా అది? ఎవరా వచ్చేది?

సుధా:— వారంతా కడుపు నిండిన మహాత్ములు. చాల గొప్పవారు మన దేశంలో అభివృద్ధి సాధించటానికి ప్రణాళికలు వేస్తున్నారు కదూ! వారు ఆశాఖకు మంత్రి. ఆయన సతీమణి ఆడవారి ఆర్థిక సామాజిక అభివృద్ధికి కృషిచేసే ఆమె.

శాంతి:— గొప్పవారైనంతలో చేసిన తప్పేముంది? అసలు విషయం అర్థంచేసుకోవాలి. తప్పకుండావెళ్లి వారు చెప్పేది విందాం. మనకే తెలుస్తుంది, మంచి యేదో, చెడుయేదో ఏమంటావు అన్నయ్యా?

సుధా:— అంతేనమ్మా! నీవు చెప్పిందీ నిజమే.

శాం:— అయితే సాయంత్రం తప్పకుండా వెళ్దామా మీటింగుకు?

సుధా:— అలాగే నమ్మా!

శాంతి:— అయితే నేను జమీందారు గారింటికి వెళ్లిపని చూసు కుని వస్తా. ఎక్కడికన్నా వెళ్తేతాళంచెవి ఆ చూరుగూట్లో పెట్టి మరీ వెళ్లు. ఏం? మర్చిపోవుకదూ!

సుధా:— అలాగే నమ్మా! (శాంతి నిష్క్రమించును) హు! ... ఇదీ స్వరాజ్యం. ప్రజలకు చదువులేదు, చదువుకుంటే ఉద్యోగం రాదు. "వ్యక్తుల శక్తే. సంఘానికి ముక్తి". "సంఘ సౌష్ఠవానికి పునాది" అంటారు. కాని నాలాటి వ్యక్తులు యెందరో యిలా మాడి పోతున్నారు. అయినా దేశంలో సందేశం యిచ్చే వారు యెక్కువై పోయారు. చెప్పేది చేస్తే కదా మనకీ ముప్పు తప్పేది. (వాకిట్లో "సుధాకర్! సుధాకర్" అని కేక వినిపిస్తుంది) ఆ! వస్తున్నా. (జమీందారుగారి కుమారుడు భద్రం కారు దిగి వస్తుంటాడు)

సుధా:— అరే! మీరా! ఇంత దూరం వచ్చారేం? కాకితో కబురు చేస్తే మీగడప దగ్గర వాలక పోయానా!

భద్రం:— ఏమీలేదు. నిన్ను చూద్దామనే వచ్చాను. (భద్రం వంటినిండా యీగలు, దోమలు, ముసురు తుంటాయి. ఒక చేతితో దోమలు తోలుకుంటూ రెండవ చేతితో ముక్కు పట్టుకుంటాడు)

సుధా:— చూశారుగా బాబూ మా యిండ్ల పరిస్థితి. అందుకనే తమలాంటివారు రావడానికి అనువయింది కాదు యీ స్థలం అనింది.

భద్రం:— సుధాకర్! నీవు శాస్త్రీ కూస్త్రీ చదువుకొనికూడా యీ మాత్రం ఆరోగ్య సూత్రాలు పాటించకపోతే యెలా?

సుధా:— ఏం చెయ్యమంటారు చెప్పండి?

భద్రం:— మన యింటిని, వీధిని, గ్రామాన్ని శుభ్రంగా వుంచుకోవాలి. "ఆరోగ్యమే మహాభాగ్యం" అన్నమాట వినలేదా? నేను అందుకు విచారిస్తున్నాను కాని, యిక్కడకు రావడానికి నాకేమాత్రం అభ్యంతరంలేదు.

సుధా:— ఏం చెయ్యమంటారు చెప్పండి? ప్రక్కయింటివారి మురికినీరు, ఎదురింటివారి పశువుల పేడ, వెనుకింటివారి పాకీదొడ్డి... అన్నీ చుట్టుముట్టి అనారోగ్యానికి ఆలయంగా తయారు చేశాయి మాయింటిని.

భద్రం:— అయితే వారితో చెప్పి చూడలేదా?

సుధా:— చెప్పకేం! ఒకరు పంచాయతీబోర్డు సభ్యులు. మరొకరు ఆయన బావగారు, పలుకుబడిగల పెద్దమనుషులు, ఏం చెయ్యమంటారు చెప్పండి?

భద్రం:— అందుకనే యువకులైన మనం పంచాయతీలలో ప్రవేశించి ప్రజాహితాన్నే ధ్యేయంగా పెట్టుకుని ప్రవర్తించాలి, సరే, అవి అలా వుండనియి, వినేవుంటావు సాయంత్రం మన ప్రణాళికల శాఖామాత్యులు వారి సతీమణి మన గ్రామానికి వస్తున్నారు. మన యువతీ యువకులందరూ వారికి సన్మాన పత్రం సమర్పించాలనుకున్నాము, అందుకు నీవూ సహకరించాలి. ఏమంటావు?

సుధా:— నా సహకారమా?! తమరు నన్ను తమాషా చేయటం లేదుకదా! నేను యేమి చేయగలను? ఏమి యివ్వగలను?

భద్రం:— పిచ్చివాడా రోజులు మారాయి. మనకు డబ్బే ముఖ్యం కాదు. మానవసేవే మాధవసేవ. సహకారం మన మంత్రా క్షరం. ఒకరినొకరు సోదరభావంతో సాదరంగా చూసు కోవాలి. అంతే నేడు మనకు కావలసింది. ఇంతకూ నీవు యువజన సమితిలో సభ్యుడుగా చేరాలి.

సుధా:— నేనా?!!

భద్రం!— అవును. నీవే. అంత ఆశ్చర్య పడుతావేం? నీవు యువ కుడివి కావా?

ధాసు:— యువకుడినే లెండి........పూటకు........

భద్రం:— పూటకు లేదనే మాటకు యీ పూటతో స్వస్తిచెప్పు. కష్టపడి పనిచేస్తే మన కష్టాలన్నీ గట్టెక్కుతాయి. అన్ని సమాజాల్లో మాదిరిగా యీ సమాజ సభ్యులు చందాలు చెల్లించాలని అనుకుంటున్నావుకదూ! అవేమీ అవసరం లేదు. సర్వకాల సర్వావస్థలలో సంఘ సంక్షేమానికి పాటు పడుతానని ప్రతిన తీసుకొంటే చాలు. అదే దీనికి రుసుము.

సుధా!— ఓ.... అలాగయితే యిప్పుడే చేరుతా! నాకు మాత్రం అంతకు మించిన పని యేముంది?

భద్రం!— చాల సంతోషం. పది గంటలకు అందరూ యెలి మెంటరీ స్కూలులో కలుసుకుందాం. తప్పకుండా వస్తావు కదూ! మరి, వస్తా, నమస్తే!

సుధా:— నమస్తే!

—తెర—

# రెండవ రంగము.

స్థలం:— జమీందారుగారి యిల్లు  సమయం:— ఉదయం 11 గం॥

[జమీందారుగారి యింటివరండా, వరండానిండా సోఫాలు కుర్చీలు అందంగ అలంకరించబడి వుంటాయి. నౌకరు రాముడు బల్లలమీద గుడ్డలు మారుస్తూ కుర్చీలు అటూయిటూ వేస్తూ, హుషారుగా పాట పాడుతుంటాడు. పాట చివరలో జమీందారు, వారి బావమరిది సురేష్ ప్రవేశిస్తారు.]

జమీం:— ఏరా రాముడూ? ఎన్నిసార్లు చెప్పాను? అవెధవపాటలు యింట్లో పాడవద్దని?

రాము:— అవి కాదయ్యా! మొన్న అదేదో సినిమాకు పోయాను. అందులో విని యేదో గొణుగుతున్నాను. అంతే!

జమీం:— ఏడిశావు. Tappals యేమన్నా వున్నాయోమో పోయి చూసిరా!

రాము:— అదికాదయ్యా.........

జమీం:— వెళ్ళుముందు. [రాముడు వెళ్ళి టపాల్సు తెచ్చి యిస్తాడు. టపాల్సు చూస్తుంటాడు జమీందారు, ఒక ప్రక్క కుర్చీలో కూర్చున్న సురేష్ జమీందారు ముఖ కవళికలను జాగ్రత్తగ పరిశీలిస్తుంటాడు. ఇంతలో జమీందారుగారి అమ్మాయి ప్రేమ హడావుడిగా ప్రవేశిస్తుంది.]

ప్రేమ:— నాన్నా! నాన్నా!

జమీం:— ఏమిటమ్మా! అంత రొప్పుతూ వస్తున్నావు?

ప్రేమ:— ఇవాళ పంచాయితీ బోర్డుప్రెసిడెంటు యెన్నిక జరిగే రోజునాన్నా!

జమీం:— ఓహో! అలాగా! అయితే యేమమ్మా?

ప్రేమ:— అన్నయ్యకూడ ఒక అభ్యర్థిగా నిలబడుతున్నాడు కదు నాన్నా!

జమీం:— అయితే అవనియి,

ప్రేమ:— అయితే అవనియి అంటారేంటి నాన్నా! అందరూ ప్రచారం జోరుగా చేస్తుంటే, మీరుకూడ ఒక్కసారి అక్కడికివస్తే అన్నయ్య తప్పకుండ నెగ్గుతాడు నాన్నా!

జమీం:— పిచ్చిపిల్లా! ఇది ప్రజాస్వామ్యయుగం, పంచాయితీలదే పరిపాలన అంతా. అందువల్ల ప్రజలే తమకు కావలసిన ప్రతినిధిని యెన్నుకుంటారు. సమర్థుడైనవాడిని యెన్నుకోకుంటే యెన్నో అనర్థాలు కలుగుతాయి అందువల్ల యిందులో యెవరి జోక్యమూ వుండకూడదు, ఏమంటావు సురేష్!

సురే:— [విషం దాగివున్న మందహాసంతో] అంతేబావా! అంతే! సరైన మాట చెప్పావు.

ప్రేమ:— అయితే అన్నయ్య నెగ్గటం యెలాగు?

జమీం:— సత్తావుంటే ప్రజలే యెన్నుకుంటారు.

సురే:— అవును. అవును [ఇంతలో మంగళవాద్యాలు, జయ జయధ్వానాలు వినవస్తాయి. అందరూ వాటిపైపు దృష్టిని నిలిపివింటారు. క్రమంగ 'భద్రింగారికిజై' అనే నినాదాలు దగ్గరగా వినిపిస్తాయి]

ప్రేమ:— నాన్నా! నాన్నా! అన్నయ్య గెలిచాడునాన్నా! యెంత ఆనందం!

జమీం:— ఆ!......అబ్బాయి గెలిచాడా! హు!... సింహాంకడుపున మేకపిల్ల పుడుతుందా యెక్కడన్నా!......ఇప్పుడే వాడిని లోపలికి తీసుకొని వస్తా వుండు.

ప్రేమ:— ఉండండి నాన్నా, హారతి తెస్తాను. అంతవరకు అన్నయ్యను లోనికి రానివ్వద్దు సుమండీ!

జమీం:— అలాగే ఒక కొబ్బరికాయకూడ తీసుకురా. నాయనకు దిష్టి తీయాలి. ఎంతమంది కండ్లుపడ్డాయో అబ్బాయిమీద

ప్రేమ:— శాంతీ! శాంతీ! కొబ్బరికాయ, మంగళహారతి పట్టుకురా!

శాంతి:— తెస్తున్నానమ్మా. [శాంతి ఒకతట్టలో మంగళహారతి, కొబ్బరికాయతో ప్రవేశిస్తుంది, అదే సమయంలో కంఠం

నింత పూలమాలలతో భద్రం ప్రవేశిస్తాడు. ఇద్దరిచూపులు కలుస్తయి. జమీందారు కొబ్బరికాయ భద్రం చుట్టూతిప్పి దిష్టితీస్తాడు. ప్రేమ హారతి యిచ్చి బొట్టుపెట్టి లోనికి తెస్తుంది. భద్రం తండ్రి పాదాలకు నమస్కరిస్తాడు. సురేష్కుఖం జేవురిస్తుంది నోట మాటరాదు. బలవంతం మీద అసూయ అణగ [నొక్కుకుంటాడు]

జమీం:— భద్రం, చాల సంతోషం నాయనా!

కం॥ పుత్రోత్సాహము తండ్రికి
పుత్రుడు జన్మించినపుడె పుట్టదు జనులా
పుత్రుని కనుగొని పొగడగ
పుత్రోత్సాహంబునాడు పుట్టుర సుమతీ॥

అని వూరికెనే అన్నాడా సుమతి శతకకారుడు? నిన్ను చూస్తూంటే మిన్నునంటినంతటి ఆనందం కలుగుతూంది. నేను ప్రెసిడెంటు నయ్యానంటే ఆరోజులువేరు. డబ్బుంటే కొండమీది కోతిఅయినా దిగివచ్చేది. కాని ఈరోజుల్లో ప్రజలే రాజులు. రాజులే ప్రజలు. ఎంతనమ్మకం వుండ బట్టి యెన్నుకున్నారంటావు నిన్ను?

రాము:— అది కాదయ్యా!

జమీం:— ఏమిట్రా నీ వాగుడు?

రాముడు:— ఆ...యేమీలేదు. అందరూ అనుకొంటున్నారు కదా!

జమీం:— ఏమనిరా?

రాముడు:— ఏమీ లేదు బాబూ!

జమీం:— చెప్పు ముందు.

రాముడు:— అందరూ చినబాబుగారిని తెగపొగడు తున్నారుబాబూ!

జమీం:— హు!...లేక నిన్ను పొగడాలేరా? ఏమంటావు సురేష్?

సురే:— (అతి కష్టంమీదతేరుకొని) ఆ...ఆ...అంతే...అంతే!

భద్రం:— అంతా మీ ఆశీర్వాదబలం నాన్నా! అంతే, నేను అనుభవం లేని యువకుడిని. అన్నివేళలా మీసలహాలతో ప్రజాసేవ చేయాలనే నాఆశయం, అంతకుమించి నేను ఆశించేది లేదు.

జమీం:— అవును నాయనా. నీహృదయం నవనీతం, నీకుతప్పక భగవంతుడు మేలు చేస్తాడు, ఆ...ఒక్కమాట, ఎన్నాళ్ల నుండో చెబుదా మనుకొంటున్నాను.

భద్రం:— సెలవియ్యండి నాన్నగారూ, మీమాట కాదంటానా?

జమీం: కాదనవు కదూ?

భద్రం:— చెప్పండి, తప్పకుండా చేసి తీరుతాను.

జమీం:— అయితేవిను. ఇవిగో తాళంచెవులు, నేను పెద్దవాడి నయిపోతున్నాను. ఇంక యింటి బాధ్యత నీవే చూసుకోవాలి. ఊఁ?

సురే:— (ఒక్కసారి ముఖ కవళిక పూర్తిగా మారిపోతుంది)
ఆఁ?...

జమీం:— ఏమిటి సురేష్?

సురే:— ఆ...... ఆ ఏమీ లేదు.

జమీ:— నా యోచన యెలావుంది?

సురే:— బాగానే వుంది.

భద్రం:— క్షమించండి నాన్నగారూ! లోకం పోకడలు తెలియని కుర్రవాణ్ణి. ఇంత బరువు నాచేత మోయించడం మీకు భావ్యమేనా? మరికొన్నాళ్లు మీరే యీ బాధ్యత వహించమని ప్రార్థిస్తున్నా!

సురే:— (ముఖ కవళిక మళ్లీ మారుతుంది).

జమీ:— అవన్నీ నాకు తెలుసునయ్యా. చెప్పినట్లు చెయ్యి. అంతే నీవంతు. తెలిసిందా? బెదురుంటే యెదురు చెప్పకూడదు.

భద్రం:— సరే మీఇష్టం. మీరంతగా ఆజ్ఞాపిస్తుంటే యేంచెయ్యను? (అయిష్టతతో తాళం చెవులు తీసుకుంటాడు. సురేష్ కోపంతో పైకి కనిపించకుండా బుసలు కొడ్తుంటాడు).

రాము:— (ప్రవేశించి) భోజనాలు తయారయ్యాయి బాబయ్యగారూ!

జమీ:— ఆ వస్తున్నామండీ! అదికాదయ్యగారూ! సిద్ధంచేయండి.

## మూడవ రంగము.

సమయం:— రాత్రి 8 గంటలు — స్థలం:— సుధాకరుని పూరిల్లు.

(శాంతి చేతిలో చేట — బియ్యం చేస్తుంటుంది — సుధాకర్ పేపరు చదువుతూంటాడు)

శాంతి:— అన్నయ్యా! అయితే, మంత్రి అంటే పెద్దవుద్యోగంకదూ?

సుధా:— అవునమ్మా!

శాంతి:— మరి ఆమె మనలాగే నేతబట్టలు కట్టుకొన్నదే. మెడ చూస్తే నల్లపూసలో తెల్లపూసైనా లేదు. ఇదేం విడ్డూరం మరి?

సుధా:— చిట్టి చెల్లీ! ఆదేనమ్మా వారిలోవుండే గొప్పతనం. నిరాడంబరంగా వుండి డంబాలు కొట్టేవారికి వారు మార్గం చూపుతారు.

శాంతి:— అయితే ఆభరణాలు కూడా ఆడంబర సూచకాలేనా?

సుధా:— కాక యేమిటిమరి? అందరూ అన్నంలేక అలమటిస్తుంటే నగలకనీ నాణ్యాలకనీ ద్రవ్యాన్ని వ్యర్థ పుచ్చడం ఆడంబరంకదూ?

శాంతి:— ఇది మరీ బాగావుంది. తన్నుమాలిన ధర్మమా అన్న
దాన ధర్మాలు చేసి వారు సన్యాసులై పోవాలా?

సుధా:— దాన ధర్మాలు చేయనక్కర్లేదు. సన్యాసులలో కల
అక్కరలేదు. వారి డబ్బును వారు జాగ్రత్త పెట్టుకుం
చాలు.

భవిష్యత్తులో యెన్నో ఆవసరాలు వస్తుంటవి. అందు
ఆ ధనం ఉపయోగిస్తుంది.

శాంతి:— నగ మాత్రం మన కష్టకాలంలో ఆదుకోదంటావా?

సుధా: కష్టకాలంలో ఆదుకొంటుంది. కష్టాలలో పడదోస్తుం
మొన్న పత్రికలో చూడలేదూ? నగలకోసమని ప
దొంగలు నలుగురి ప్రాణాలు తీశారని! ఏమంటావు?

శాంతి:— నిజమే నన్నయ్యా ఎక్కడో యెందుకు, మన వ
రత్తమ్మత్తయ్య గతేమయిందీ?

సుధా:— అదొక బాధ. ఇక నగధరకూడ తగ్గుతుంది పెరు
తుంది! ఒకరోజున్న ధర మరొక రోజుండదు.

శాంతి:— అవును. అవును.

సుధా:— పోనీ యేమన్నా వడ్డీ గిట్టుతుందా?

శాంతి:— అదీలేదు.

సుధా:— మొన్న వెంకన్న మామ గుడిసెకాలి, కరెన్సీ నోట్లన్నీ బుగ్గి అయిపోతే యేం చేశాడు పాపం?

శాంతి:— ఏంచేశాడు? 'ఆబో ఇబో లక్ష్మణా' అని మొత్తుకున్నాడు.

సుధా:— అందుకనే మనంమనధనాన్ని భవిష్యత్తుకోసం ప్రమాదం లేని పద్ధతిలో లాభసాటిగా వుండే మార్గంలో దాచుకొని పొదుపు చేసుకోవాలి.

శాంతి:— ఎలా చేయాలంటావు?

సుధా:- అంతావిన్నావుకదూ? మంత్రిగారు చెప్పింది? తెలుసుకుంటే యెన్నో మంచి మార్గాలున్నాయి. సర్కారు ఋణపత్రాలు National Plan Savings certificates........ యింకా యిలాటి వెన్నో.

శాంతి:— అవును అవును. అందులో దాచుకుంటే దొంగలు దోచుకుంటారనే భయంలేదు. వడ్డీకి వడ్డీ వస్తుంది. సొమ్ముకు ప్రభుత్వంవారి హామీ వుంటుంది. నిజంగా యిది యెంతమంచి పద్ధతి?

సుధా:- అవునమ్మా! ఈ డబ్బే యిప్పుడు మనదేశంలో భారీ యెత్తున జరుతూవున్న నాగార్జున సాగర్, భైరవాని తిప్ప మొదలైన ప్రాజెక్టులకు, ఉక్కు కర్మాగారాలకు, వైద్య కళాశాలలకు......యిలాంటి యెన్నో అభివృద్ధికరమైన పనులకు పనికివస్తుంది. ఏమంటావు?

శాంతి:— అవును, అన్నయ్యా! అన్నట్టు మరచాను, మనింట్లో నాయనమ్మనాటి బంగారు కంటె వుందికదూ! నాన్నతో చెప్పి దాన్ని అమ్మి సేవింగ్స్ సర్టిఫికేట్లు కొందాం. బంగారు ధర పెరిగింది. అమ్మతాన న్నాడు నాన్న, అప్పుడు నేనే వద్దన్నాను.

సుధా:— ఓ! మంచి ఆలోచన. నాకు గుర్తే రాలేదు సుమా, సరే, మంత్రిగారు చెప్పారు. విన్నావుకదూ. దేశంలో మరి పదేళ్ళకు తిండి, గుడ్డ, యిల్లు, ఆరోగ్యం, విద్య... యిలాంటి కొరత లేవీ వుండవని .

శాంతి:— అయితే అది నిజంగా జరిగేదే నంటావా?

సుధా:— తప్పకుండా జరుగుతుంది. అయితే ప్రజల సహకారం లేనిదే యేప్రణాళికలైనా ఫలించవు. అందరూ సహకరిస్తే మనం ఆశించిన అభ్యుదయం తప్పకుండా వచ్చితీరుతుంది.

శాంతి:— అన్నయ్యా! ఇంతకూ మాటల సంగతిలో తిండిమాటే మరచిపోయాము, అన్నానికి లే. అన్నట్టు యింట్లో అన్నీ విండుకున్నాయి. రేపు ఉదయం రంగయ్యకొట్లో కావలసిన సరుకులు తెచ్చి మరీ వెళ్లు ఎక్కడికన్నా వెళ్తే.

సుధా:— 'తప్పుడు తూకము'—'తక్కువ కొలత' ఆ రంగయ్య దుకాణంతో అరువు పెట్టితే మన యిల్లూ వళ్లూ గుల్లయి పోతాయి.

శాంతి:— అంతకు మించి మనం చేసేది యేముంది?

సుధా:— మన జమీందారుగారి అబ్బాయి భద్రం మనవూళ్లో ఒక Multipurpose Cooperative Society ని స్థాపించే యేర్పాట్లు చేస్తున్నారు. అందులో మనకు కావలసిన సరుకులన్నీ సరసమైన ధరలకు దొరుకుతాయి.

శాంతి:— అదికాదన్నయ్యా! రంగయ్య అయితే పంటవచ్చిందాకా ఆగి ధాన్యం కొలుచుకుంటాడు పాపం.

సుధా:— పాపం...ఎంత పిచ్చిపిల్లవు! రంగయ్యకు మనమీద దయ అనుకున్నావా? అంతా దొంగ లెక్కలు వ్రాసి మన ధాన్యాన్ని తక్కువ ధరకుకొని కుబేరుడైపోయాడు. ఇక ఆభయం యేమీలేదు. వ్యవసాయ శాఖవారు మనకు విత్తనాలకు, యెరువులకు, యెడ్లకు, బావులు త్రవ్వించుకునేందుకు అన్నిటికీ అరువులు యిస్తున్నారు. అవి తెచ్చుకుని, అవసరం తీరింతర్వాత మళ్లీ యిచ్చెయ్యవచ్చు.

శాంతి:— మరి యిన్నాళ్లూ ఎవరూ యీ వూసే యెత్తలేదే!

సుధా:— అసలు యిన్ని సౌకర్యాలున్నాయని తెలిస్తేగా. ఈ రోజే భద్రంగారు యీ విషయాలన్నీ మా యువజన సమితిలో చెప్పి, ధనాన్నియిచ్చి, అవసరమైన యేర్పాట్లు చేస్తున్నారు.

శాంతి!— భద్రం బాబుగారు యెంతమంచివారు!

సుధా:— నిజంగానే. ఉన్న వాడైనా వెన్నలాంటివాడు; మంత్రిగారి ఉపన్యాసం, భద్రంగారి సలహాలు విన్న తరువాత నా మనస్సంతా మారి పోయింది.

శాంతి:— కడుపు నిండిన వారు అని వేళాకోళం చేశావే మరి!

సుధా:— ఏదో ఆవేశంలో అన్నాను. ఆ!...అన్నట్లు రేపటి నుండి నేనే పొలానికి పోతున్నాను.

శాంతి:— చాలు. చాలు, నీవేమిటి పొలందున్నుటమేమిటి? ఇంత చదువు చదివి...అన్నట్లు....

సుధా:— ఊ! .... అన్నట్లు! .... "కులవృత్తికి సాటిలేదన్నట్లు" చెల్లాయిగారూ... చదువు విజ్ఞానానికీ కులవృత్తి పొట్ట కూటికీ....ఇందులో తప్పేముంది?

శాంతి:— తప్పేమీ లేదు. కానీ నాన్న నీ మీద యెన్నో ఆశలు పెట్టుకున్నాడు. ఉద్యోగాలుచేసి ఊళ్లేలు తావని ఉవ్విళ్లూరి పోతున్నాడు.

సుధా:— నేను నాన్నకు నచ్చచెబుతానుగా, వ్యయసాయంలో వచ్చే ఫలసాయం కన్నా ఉద్యోగాలలో అధిక ఆదాయం వస్తుందా? వెఱ్ఱిగాని, అటు నాన్నకు శ్రిమ తగ్గుతుంది. ఇటు నిరుద్యోగసమస్యా తీరుతుంది. ఏమంటావు.

శాంతి:— సరేలే. యికలే. అన్నానికి చాల పొద్దుపోయింది.

సుధా:— వడ్డించెయ్యి. వస్తున్నా.

—తెర—

## నాలుగవ రంగము.

[జమీందారుగారి ధాన్యపుకొట్టు. భద్రం, సురేష్ ప్రవేశం]

భద్రం:— మామయ్యా! రైతులందరూ మన మన పత్తాలు సక్ర మంగా యిచ్చినట్లేనా యీ యేడు?

సురే:— లెఖ్ఖ చూడలేదండి చినబాబుగారూ...చూసి చెబుతాను.

భద్రం:— చినబాబుగారేమిటి మామయ్యా? నేనేం నీకు పరాయి వాడినా? పేరుపెట్టి పిలిస్తే కాదన్నానా!

సురే:— కాదనలేదనుకోండి, అయినా....మీరు యజమానులు.

భద్రం:— నేను చెబుతున్నానుగా పేరువెట్టి పిలవమని.

సురే:— సరే. అలాగే......ఆ...లెఖ్ఖ పుస్తకం తెస్తాను. వివరాలన్నీ చెబుతాను.

(సుధాకర్ బండ్లలో ధాన్యం తీసుకొని వస్తాడు).

భద్రం!— ఓ! సుధాకర్! రారా! అరే! ధాన్యం నీవే తెస్తున్నావే! మీనాన్నగారు లేరా? ఎక్కడికి వెళ్లారు?

సుధా!— మీకింకా తెలీదన్నమాట. మీమాట ప్రకారం ఆ నాటి నుండి మా నాన్నగారికి విశ్రాంతియిచ్చి నేనే వ్యవసాయ రంగంలోకి దిగాను.

భద్రం:— ఓ! చాల మంచిపనే చేశావు. ఇంతకూ పంట యెలా పండింది?

సుధా:— పంటా! మామూలు దానికి రెట్టింపు పండింది. మన Agricultural Demonstrator గారు చెప్పినట్లల్లా చేశాను. 'జపాను పద్ధతి' అంటే 'చైనాపద్ధతి' అని వెక్కిరించారు. నవ్విననాపచేనే పండిందన్నట్టు వాళ్ళందరకూ పదిబస్తాలు పండడమే గగనమైతే, నాకు ముప్పై బస్తాల వరకూ రాలినవి.

భద్రం:— అవును సుధాకర్! మనలాంటి యువకులు ముందుకు వచ్చి నూతనవీన పద్ధతుల ననుసరించి వ్యవసాయం చేయటం నేర్పించాలి. అప్పుడు కాని అధికాహారోత్పత్తి కాదు.

సుధా:— రసాయనిక యెరువులు వేస్తే భూమిపాడై పోతుందన్నారు. 'మా విత్తనాలకన్నా మీ మేలిరకం విత్తనాల మేలుమేము చూడమా' అని మూతి విరిచారు. కాని వాళ్లందరే యిప్పుడు నన్ను మెచ్చుకుంటున్నారు. వాళ్లకు మనసొసైటీ చవుక ధరల్లో యెరువులు, విత్తనాలు, అన్నీ సప్లయి చేస్తారని చెప్పాను; తెగుళ్లు తగులకుండా మందులు వేసుకోవాలనీ, కంపోస్టు యెరువు వాడాలనీ, వీటివల్ల అధికంగా ఆహారం పెరుగుతుందనీ తెలుసుకున్న రైతులందరూ మిమ్మల్ని యెంతో పొగడుతున్నారిప్పుడు.

భద్రం:— మన అభివృద్ధి పనులను వారు అర్థం చేసుకుంటే అంతకన్నా కావలసింది యేముంది?

సుధా:— ఇంకా అర్థం చేసుకోరా? ఈ సంవత్సరం పేరూరు ప్రాజెక్టు నీళ్లు రావటంతో వర్షం రాకపోయినా పంట పండిన సంగతి మరుస్తారా?

భద్రం:— అవిసరే సుధాకర్! మరొక ముఖ్య విషయం. మన వూళ్లో బంజరుగావున్న భూమినంతా భూమి లేనివాళ్లకు పంచమని ప్రభుత్వం వుత్తర్వు జారీచేసింది, దానికి ట్రాక్టరుకూడ తెప్పిస్తున్నాను. అందరూ చేరి సహకార పద్ధతిలో వ్యవసాయం చేస్తే అందులోనుండి యెంతైనా పంటపండించవచ్చు. ఆ విషయం ఊళ్లో పేద రైతులంద రికీ తెలియజేయి.

సుధా:— ఓ! తప్పకుండా. ఈ సహకార వ్యవసాయాన్నే, నిన్న పట్నంనుండి వచ్చిన ఒక పెద్దమనిషి తెగ విమరిం చాడు. "మా రైతులకు యిదేం కొత్తకాదు. నీకు వ్యవ సాయం సంగతి తెలీదు పోవయ్యా" అని రైతులే ఆపెద్ద మనిషికి బుద్ధిచెప్పి పంపించారు.

భద్రం:— సుధాకర్! నీలాంటి ఆదర్శయువకుడిని చూస్తుంటే నా హృదయం పొంగి పోతుంది. అందరు యువకులు నీమార్గాన్నే గనుక అనుసరిస్తే దేశంలో తిండి కొరతే వుండదు. ఆ!...అనట్టు యిప్పుడు మీరు చేస్తున్న

భూమిని మీరే యిక అనుభవించండి. మామయ్యా! ఆ యెనిమిదెకరాల భూమిని సుధాకర్ పేరిట పట్టా వ్రాసిచ్చెయ్యండి.

సుధా:— అదేంటి భద్రంగారూ! మాకు అనవసరంగ ఆశచూప కండీ! ఇప్పటికే మీకెంతో ఋణపడి యున్నాము. ఏదో మీదయ మాలాంటివారి మీదవుంటే చాలు.

భద్రం:— ఇందులో యెవరి దయకు యేమున్నది సుధాకర్? భూమి, నీరు, గాలి భగవంతుడిచ్చినవి. అందరూ సమానంగా అనుభవించాలి. భూమిని సాగుచేయకుండా బీడుగా వుంచేవాడు పాపాత్ముడు. దున్నేవాడికే భూమి నివ్వాలి. ప్రభుత్వం భూసంస్కరణలు తెస్తున్నారా? వినోబాజీ ఆరంభించిన భూదాన యాత్ర జయప్రదంగ సాగుతున్నదా? పరిస్థితులు ప్రగతి మార్గంలో పయనిస్తున్నవి.

సుధా:— మీ మనసు నిజంగా వెన్నకన్న మెత్తనయింది. అయినా మీ భూమిని పుచ్చుకోవటానికి నా మనస్సు అంగీంకరించటం లేదు. చాల అన్యాయం అనిపిస్తూంది.

భద్రం:— పిచ్చివాడా! కలవాని స్వార్థం కలకాలం వుండదు. యెరువులు వేసి యెన్నో మరమ్మత్తులు చేశారు, మీ సత్తువను అందులో దారపోశారు, ఇన్నేండ్లు మక్తా యిచ్చారు. ఇకనైనా మీరు దాన్ని సంపూర్ణహక్కులతో అనుభవించండి. మామయ్యా అవసరమైన రాత కోతలు కానిచ్చెయ్యండి.

సురే:— ఒక్కసారి బావతో చెప్పి మరీచేస్తే బావుంటుందేమో!

భద్రం:— నాన్నగారు నేను చేసిన పనిని కాదనరు. సరికదా హర్షిస్తారు. ఆలశ్యం చేయకండి.

సురే:— అలాగే!

భద్రం·— సుధాకర్! ఇకమీదట మనవూళ్లో సహకార వ్యవసాయాన్ని పెంపొందించి అధికాహారోత్పత్తి అయ్యేటట్లు చేసే బాధ్యత నీదే! రైతులందరినీ మేలుకొలిపి 'కృషితో నాస్తి దుర్భిక్షం' అని ఋజువు చెయ్యాలి. ఇక పోదాం పద.

— తెర —

## 5వ రంగము

[జమీందారు, బావమరది సురేష్ చదరంగం ఆడు తుంటారు. నౌకరు రాముడు పటాల బూజు దులుపుతూ అటూ యిటూ తిరుగు తుంటాడు.]

జమీ:— అయితే! సురేష్! అబ్బాయి పెత్తనంలో అంతా సవ్యంగా సాగుతున్నట్టేనా?

సురే:— ఆ! ఆ! ...... అయినా అనుభవంకావాలి కదాబావా దేనికైనా!

జమీ:— ఏమయింది యింతకూ?

రాము:— అది కాదయ్యా!...

జమీ:— ఏమటయ్యా?

రాము:— చిన బాబుగారు ప్రెసిడెంటు అయ్యాక మన వూరు రూపమే మారి పోయింది బాబూ.

జమీ:— ఏమయిందేమిటిరా?

రాము:— మన పిల్లలలో బలంలేదట. అందుకని అందరకూ పండ్లూ, పాలూ, గుడ్లూ... వుచితంగ పంచుతున్నారు. అందుకని అందరూ చినబాబుగారిని......

సురే:— ఊ... అందుకని? నిన్ను యీ [illegible] అనవసరపు వాగుడు వాగమన్నారు. పో అవతలకు.

రాము:— అది కాదయ్యా!

జమీ:— ఉండు సురేష్! రాముడు చెప్పేదేదో చెప్పనియ్యి. ఆ తరువాత?

సురే:— అది కాదుబావా! ఈ విధంగా బీదలని సాదలని మన ధనాన్ని కొల్లగొడితే మనయిల్లు గుల్లయిపోదూ?

జమీ:— పిచ్చివాడా! కలిమిలేములు కావడికుండలు, మనం ఒకళ్ళకు యిస్తే భగవంతుఁడు మనకు యిస్తాడు. ఇదంతా శాశ్వతం అనుకున్నావా? ఆ తరువాత? చెప్పు రాముడూ!

రాము:— ఆ... మన కో—ఆపరేటివ్ సొసైటీకి చినబాబుగారు మన అద్దాల మహలు యివ్వటంతో వూళ్లో జనం అందరూ 'అపర కర్ణుడు అయ్యగారు' అంటూ...

సురే:— ఊ... అంటూ...? ఏమిట్రా నీ వాగుడు? బాబుగారికి ఇవన్నీ యెవరు చెప్పమన్నారు?

రాము:— అది కాదయ్యా!...

జమీ:— అది సరే సురేష్! అబ్బాయి చేస్తున్న పనులన్నీ యెంతో వుదాత్తంగాను, వున్నతంగాను వున్నాయి. ఏమంటావు?

సురే:— అదికాదుబావా! చెప్పటం యెందుకని నీకు చెప్పలేదు. భద్రం ధోరణి మన భద్రానికే ముప్పు వాటిల్లేటట్టుంది. మొన్న సుధాకర్ వాళ్ళకు ఆ యెనిమిదెకరాల భూమిని పట్టా వ్రాయించేసెయ్య మన్నాడు.

జమీ:— అంటే? ఆలస్యం యెందుకు? ఇచ్చెయ్యి!

సురే:— అప్పుడే వ్రాయించేశాను బావా. నామాట కొంచెం విను బావా! ఈ విధంగా దానాలు చేస్తుంటే కొండలైన కరిగి పోతాయి. చివరకు మనకు చిప్ప చేతికివస్తుంది. అప్పుడు?

జమీ:— ఛీ! ఛీ! ఏమిటామాటలు. నీవు యెవరిదగ్గర మాట్లాడు తున్నావో తెలిసే మాట్లాడుతున్నావా? మాది చేతికి యెముక యెరుగకుండా దానంచేసిన ఉన్నత వంశము, మా తండ్రి, తాత, ముత్తాతలు, ... అగ్రహారాలు గ్రామాలు భూములు, లెక్కకు మిక్కుటంగ బీదలకు యిచ్చారు. నేనూ యిచ్చాను. ఇప్పుడు చిరంజీవి యిస్తు న్నాడు. ఇదేం మాకు కొత్తా?

సురే:— క్షమించండి బావగారూ. మీకుటుంబ క్షేమం కోసమని చెప్పాను, తరువాత మీ యిష్టం. దానం చెయ్యండి, కాని కొంచెం నిదానంగా. ఆలోచించి చెయ్యండి అన్నాను. అంతే! మీ ఆజ్ఞ మీరు చెప్పినట్లల్లాచేస్తాను. నాదేముంది?

జమీ:— సురేష్! ఆ సంగతులన్నీ నాకు తెలుసు, దానాలన్నిటిలోకి భూదానం అతి ప్రధానమయింది. బంగారు భూమినుండి

పంట పండితే పచ్చని పైరుతో దేశంలో పచ్చని తోరణాలుకట్టి నిత్య కళ్యాణం చేసికొంటారు. పండించేవాడు ఒక్కడే కాకుండా యెంతమంది ఆధారపడివుంటారో వూహించావా?

సురే:- సరే బావా! నీ యిష్టం,

జమీ:- సరే, రాముడూ యింకా యేమిటిరా?

రాము:- ఆ!... అదేదో గిర్రున తిరుగుతది బుర్రున పాడుతది.

జమీ:- ఏమిటిరా?

రాము:- అదికాదయ్యా! అదేదో పాను. రేడియో అంటారే.

జమీ:- ఓహో Fan, Radio నా ఆ... అయితే యేమిటిరా?

రాము:- అదికాదయ్యా! చినబాబుగారు చిన్నపిల్లలకోసం కట్టించిన గదిలో అవి పెట్టించారండి. పిల్లలు ఆడుకొంటూ పాడుకొంటూ హాయిగా వున్నారండీ!

జమీ:- ఓహో. బావుంది, చాలబావుంది, ఇవన్నీ నీకెవరు చెప్పారురా?

రాము:- ఒకరేమిటి బాబయ్యా? వూరంతా కోడై కూస్తుంటే; కరెంటంతా బావులకు పెట్టించి యింజన్లు టకాటకా మంటుంటె...

జమీ:— ఆ!... అంటుంటే?

రాము:— అదికాదయ్యా! ఇప్పుడు యెన్నడూ పండనంత పంట పండుతున్నదంట రైతులందరూ సంతోషంతో గంతు లేస్తున్నారు.

("కారు తయారయింది బాబూ" అని తెరవెనుక వినుపిస్తుంది.).

జమీ:— ఒరేయి! రాముడూ!

రాము:— వస్తిని బాబూ (రాముడు వంకెనున్న సిల్కు లాంగ్ కోటును మడత కండువాను, పొన్నువేసిన చేతికర్రను, చెప్పులను తెస్తాడుజమీందారు అవన్నీ ధరిస్తాడు).

జమీ:— ఆ! సురేష్! నేనలా షికారు వెళ్తున్నాను. నీవూ వస్తావా?

సురే:— నాకు కొంచెం పనుంది బావా, మీరు వెళ్ళండి,

(జమీందారు నిష్క్రమించును.)

జమీ:— సరే—వస్తా! (రాముడు నిష్క్రమించ బోవును),

సురే:— ఒరేయి రాముడూ! ఇలారా!

రాము:— ఏంది బాబూ? నన్నెప్పుడూ అంతకోపంగ చూస్తారు? కూకలేస్తారు. నేనేం తప్పు చేశానని బాబూ?

సురే:— పిచ్చిపిల్లోడా! ఇక యెప్పుడూ నిన్ను కోపంగా చూడ నులే. నేను చెప్పేది బాగావిను.

రాము:— ఏంది బాబూ?

సురే:— ఆ! యేమీలేదురా! ఇదుగో, భద్రం చేస్తున్న పనులన్నీ బాబుగారికి చెప్పవద్దు తెలిసిందా?

రాము:- అదికాదయ్యా యేమి చెపుతేంట?

సురే:— ఏమా? పెదబాబుగారు యీ గొడవలన్నీ మర్చిపోయి విశ్రాంతి తీసుకుంటున్నారు. ఇక మీదట యేదన్నా చెప్పాల్సి వుంటే అదేదో నాకేచెప్పు, నేనే చెబుతాను బాబుగార్కి—.

రాము:— ఆ! అయితే నాకు తెలీక అడుగుతా......

సురే:— ఒరేయ్! శాంతిని చూశావా?

రాము:— ఏ శాంతిని బాబూ?

సురే:— అదేరా... మనయింట్లో పనిచేసే శాంతిని.

రాము:— ఓ శాంతా...అబ్బ......ఓహో (లొట్టలువేస్తాడు)

సురే:— శాంతిని నీవు ప్రేమిస్తున్నావా?

రాము:— అది ప్రేమో యేమో. శాంతిని చూస్తుంటే మాత్రం అదొక యిదిగ గుబులు గుబులు మంటుంది.

సురే:— అదేనోయ్ ప్రేమంటే! అయితే శాంతిని పెళ్లిచేసుకుంటావా.

రాము!— పెండ్లే ! అమ్మ బాబోయ్! అంత డబ్బు నాకెక్కడిది బాబూ.

సురే:— అదేనోయ్ వెర్రినాగమ్మా, నేను చెప్పినట్లల్లా చేస్తావా? నీకు కావలసినంత డబ్బు యిస్తాను. అప్పుడు హాయిగా కమ్మగా శాంతితో కాలం గడుపవచ్చు.

రాము!— ఓ! మీరు చెప్పినట్లల్లా చేస్తా. ఏదో పుణ్యంకట్టుకొని ఆమూడుముళ్లూ పడేటట్లు చేస్తిరా మొదట పుట్టే కొడుక్కి మీపేరే పెట్టుకుంటా.

సురే:— అదెంత పనిరా? ఆ!......ఇకమీదట నీవు భద్రం చేస్తున్న పనులన్నీటినీ యెప్పటి కప్పుడు నాకు చెబు

తూండాలి......ఆ......తెలిసిందా?

రాము:— ఓ!........ తెలిసింది. తప్పకుండా మీరు చెప్పినట్లు చేస్తా, సురేష్ బాబుగార్కి జై !

సురే:— ఊ......పోదాం పద యింక.

—తెర—

# 6వ రంగము

[జమీందారుగారి మేడ, సాయంకాలం 6 గంటలు. ప్రేమ కూర్చొని కుట్టుపని చేసుకుంటూంటుంది, శాంతి తోటలోని పూలనుకోసి మాలగా గుచ్చుతుంటుంది.]

ప్రేమ:— శాంతీ! శాంతీ!

శాంతి:— ఏమిటమ్మా! పిలిచారా?

ప్రేమ:— ఏమీలేదు శాంతీ! మన మహిళాసంఘంలో అందరూ చేరి అదీ యిదీ చేస్తున్నారే! నీవూ చేరకూడదూ?

శాంతి:— అదేంటమ్మా? మరీ వింతగ చెబుతారు! పనిమనిషి మహిళా సంఘములో చేరటమా! నాకేమన్నా చదువొచ్చా పత్రికలు చదవడానికి? నేనేమన్నా ఆడగలనా పాడగలనా!

ప్రేమ:— పిచ్చిపిల్లా! కాలం కలకాలం ఒకమాదిరిగ వుండదు. ఇప్పుడు వెనుకటిలాగా గొప్పలు చెప్పుకొని కాలం వృథా చేసే కాలం పోయింది. తీరుబడిలో రాబడిని పెంచుకొనే పద్ధతులు చూసుకోవాలి ప్రతివారు!

శాంతి:— అయితే మహిళాసంఘం అంటే పేకాట, టెన్నిసాటా పత్రికలు చదవటము కాదన్నమాట.

ప్రేమ:— నీవూ వచ్చిచూడు నీకే తెలుస్తుంది. ఏమి చేస్తున్నామో మేమక్కడ మొన్న రాములవారి ఆలయం ప్రక్కన

అగ్గిపెట్టెల పరిశ్రమ ఆరంభించామా! పరికరాలన్నీ ప్రభుత్వం యిచ్చింది. అక్కడ అందరూ చేరి పని చేయవచ్చు. ఊరికే కూర్చొని లోకాభిరామాయణం పారాయణ చేస్తే యేం లాభం చెప్పు.

శాంతి:— అందులో అసలే మన ఆడవాళ్ళకు కబుర్ల పోగని పేరు. ఆ యమ్మ అట్లాంటిది, ఈ యమ్మ యిట్లాంటిది అని ఆరంభించి చివరకు జుత్తు జుత్తు పట్టుకుంటారు. ఆ దెబ్బతో అక్కడే ఒక కురుక్షేత్రం వెలుస్తుంది.

ప్రేమ:— మా బాగా చెప్పావు. అందుకనే అందరికీ అందుబాటులోవుండే యీ చిన్నచిన్న పరిశ్రమలెన్నో ప్రారంభించాము. మనఊళ్లో అగ్గిపెట్టెల మీద ప్రతి స్త్రీ రోజుకు రూపాయకు తక్కువ సంపాదించడం లేదు.

శాం:— అయితే అందరికీ చదువు ముఖ్యమంటారే. ఆడవాళ్లు కూడ చదువుకోవచ్చా ప్రేమమ్మగారూ?

ప్రేమ:— ఆ విషయమే చెబుదామనుకుంటున్నాను నేను, చదువుల దొరసాని చల్లని తల్లి సరస్వతి యెవరు శాంతీ! ఆడది కాదూ? అందుకనే స్త్రీలకు రాత్రి పాఠశాలలు పెట్టి పాఠాలు నేర్పుతున్నాము. నీవూ వచ్చి చదువుకో!

శాంతి:— తప్పకుండ చదువుకుంటానమ్మా...నిజంగా ఎంతమంచిది మన ప్రభుత్వమంటేమరి యిన్ని మంచి పనులు చేస్తున్నా ప్రభుత్వాన్ని దుయ్యబట్టుతా రెందుకమ్మా చాలా మంది?

ప్రేమ:— శాంతీ! ఒక పని చెయ్యలేక పోవచ్చుగాని నూరు విమర్శలు చేయవచ్చు. అదలా ఉండనియి. మనం అన్నిటికన్నా ముఖ్యంగా గృహ విజ్ఞానాన్ని నేర్చుకోవాలి. పిల్లలను ఆరోగ్యంగా పెంచటం, యింటిని శుభ్రింగా వుంచుకోవటం, పెరటి తోటలను పెంపొందించుకోవటం ....మనం ప్రతి స్త్రీకి తెలియ జెయ్యాలి.

శాంతి:— తప్పకుండా చేద్దామమ్మా! నేను యివాళ్టినుండే మహిళా మండలికి వస్తా. భద్రిం బాబుగారి పుణ్యమా అని మనకు యెన్నో సౌకర్యాలు కలిగినయి.

భద్రం:— (ప్రవేశిస్తూ) ఏమిటి శాంతీ నా పేరు యెత్తుతున్నావు.

శాంతి:— (సిగ్గు పడుతుంది)

ప్రేమ:— ఏమీ లేదన్నయా! నీ మూలకంగా మనవూరు బాగు పడుతున్నది. అంటున్నది. శాంతి.

భద్రం: ఓహో! ఆదా సంగతి, అది సరే ప్రేమా మీ మహిళా సంఘం Night school కని పలకలు పుస్తకాలు పట్టుకొచ్చాను. గ్రామంలో బాల బాలికలకోసం Red cross వారు పాలపొడిడబ్బాలు యిస్తున్నారు. కలెక్టరుగారు కొన్ని మనకు కూడ పంపించారు. మనవూళ్లో పంచమని.

ప్రేమ:— అలాగే అన్నయ్యా! మనంకూడ పాలు తయారు చేసి పిల్లలకు పంచుదాం. శాంతీ రేపటినుండి యీ పని నీవు చేయాలి.

భద్రం:— అదిసరే ప్రేమా! మీ మహిళా సంఘం యింతమందికి యిన్ని సేవలు చేస్తున్నదే. మరి శాంతిని అందులో చేర్చి చదువు చెప్పకూడదూ.

ప్రేమ:— అదే మేమూ యింతవరకూ మాటాడు కొంటున్నాము. రెండేండ్లలో శాంతిని మెట్రిక్ పాస్ చేయిస్తాను.

భద్రం:— నాకు తెలుసు నీవు చెప్పినపని చేసి తీరుతావని (ఇంతలో సుధాకర్ ప్రవేశిస్తాడు, ప్రేమ సుధాకర్ ఒకరినొకరు ప్రేమతో చూసుకుంటారు.)

భద్రం:— ఓ సుధాకర్! రా! రా! ఏమిటి విశేషాలు.

సుధా:— ఆ! ఏమీలేదు, జిల్లా కేంద్రంనుండి భారత సేవక సమాజం కార్యదర్శి వచ్చారు. మన వూరినుండి శ్రీపురాన్ని కలిపే రోడ్డు శ్రమదానం చేసి వేస్తారట. మనయువకుల సహకారం కావాలని వచ్చారు. ఆయన మీకోసం వెదుకుతున్నారు.

భద్రం:— నాకోసం వెదకడం దేనికి? మన వాళ్లందరితో చెప్ప లేక పోయావా?

సుధా:— చెప్పాను. వాళ్లు అప్పుడే పనికిగూడ బయలుదేరారు.

భద్రం:— భేష్! మంచి పని చేశావు! చూడు ప్రేమా! సుధాకర్ యే విధంగ ముందుకువచ్చి అందరకూ ఆదర్శప్రాయు డౌతున్నాడో!

ప్రేమ:— (సిగ్గు పడుతుంది).

సుధా: - ఎందుకండీ? నన్ననవసరంగా పొగడుతున్నారు? ఇందులో నేను చేసింది యేముంది? అంతా మీచలువే! భద్రం బాబుగారూ మనవూళ్లో యింకా కుళాయిలు రాలేదేమని అందరూ అడుగుతున్నారు ఆ ప్రయత్నం యేదైనాచేస్తే బావుంటుందేమో!

భద్రం:— అవును సుధాకర్! ఆవిషయం మొన్ననే పంచాయతీలో పెట్టి pass చేయించాను. scheme అంతా తయారయి పోయింది. రెండు నెలల్లోపల కుళాయిలు వస్తాయి,

సుధా:— మీరు తలచుకొంటే జరుగనిదంటూ వుంటుందా? పంచాయతీ రాజ్యం శ్రేయోరాజ్యంగా తయారు కావాలంటే మీలాంటి వారు పూనుకోవాలి.

భద్రం:— మీలాంటి వారేమిటి, మనలాంటి వారు అను, ఏం ప్రేమా?

ప్రేమ:— ఏం శాంతీ?

శాంతి:— అంతేనమ్మా! పిన్నాపెద్దా బీదా బిక్కా అనే భేదం లేకుండా అందరం కలిసి పనిచేస్తేనే మనకు అభ్యుదయం కలుగుతుంది.

భద్రం:— భేష్! భేష్! శాంతికూడా మనతో చేరిందే చూశావా సుధాకర్!

సుధా:— అవును బాబూ! మనం మంచివాళ్లమైతే అందరినీ మంచివాళ్లుగా మార్చవచ్చు.

భద్రం:— సరే! పోదాం పదండి యిక.

# 7వ రంగము.

సురే:— (ప్రవేశించి-స్వగతం) ఆహా! ఇంతలో యెంత మార్పు! సంవత్సరాల తరబడి అనుభవిస్తూండిన ఆనందం అంత రించింది కదా! పెత్తనం చేతికి యెత్తుకున్న భద్రిం ముందు నాయెత్తు లేమీ సాగటం లేదు. బావగారి దగ్గర వేసిన పాచికలలో ఒక్కటికూడ పారడంలేదు.

ఆహా! చేతికి డబ్బు చిక్కక పోవటంతో White Horse, De Jones, Black and white యివన్నీ రుచికైనా ఒక్క చుక్క దొరకటంలేదు సరికదా మన నాటు సరుక్కూడ కరువై పోయింది కదా!

అన్నీ నా ప్రాణానికే దాపురం అవుతున్నాయి. తిమ్మిని బమ్మిని చేసి కూడబెట్టిన డబ్బు ఇదివరకు యే బక్క చిక్కిన రైతుకో నగలు గిగలు తాకట్టు పెట్టుకొని వడ్డీ మజా అనుభవించాము. ఇప్పుడు మన దగ్గరకు వచ్చే వాడు ఒకడైనా ఉంటేగా! Cooperetive Bank లో తక్కువడ్డీకియిస్తారని అందరూ అక్కడికే పోతున్నారు. అబ్బ సహకారమట సహకారం! వికారం పుట్టుకొస్తున్నది ఆ పేరు వింటేనే! సేద్యానికి సహకారము, వర్తకానికి సహకారము, చివరకు వీళ్ళందరూ సహకారంగానే చచ్చే టట్టుంది చూస్తే. (తీవ్రింగా ఆలోచించి)

అయినా దీనిని యింతటితో వదలిపెట్టితే మన ప్రాణాలు కూడ వదులుకోవలసిందే, ఏదో ఒక ఉపాయంతో యీ భద్రంగాడి పెడరెక్కలు విరిచేయాలి.

రాము:— (ప్రవేశించును) బాబూ!......బాబూ!......

సురే:— ఏరా రాముడూ? పోయిన పనేమయింది?

రాము:— పాడయింది. ఇదేం ఖర్మమో! ఇదివరకు మంచినీళ్ల కన్న యెక్కువ దొరికేది. ఇప్పుడు ఆ భద్రంగారి ధర్మమా.........

సురే:— ఆ!...ఏమిటి!?......

రాము:— ఆ! ఏమీలేదు. భద్రంగారి అఘాయిత్యం మూలంగా సారా దుకాణాలు సమూలంగ పెరికి వేయ బడ్డాయి. ఇదిగో బాబూ! యీ కొంచెందొరికే సరికి నాతల ప్రాణం తోకకు వచ్చింది. (చిన్న సీసా యిచ్చును.)

సురే:— (సీసా తీసి అందులో కొంచెం సారాను లోనికి పుచ్చు కొనును) హూ! ఎవడురా? సారాను ఆపగల మగవాడు! నేను చూస్తానుగా యెలా ఆపుతారో!

రాము:— బాబూ! ఇకమీదట యీ ఊళ్లో ఒక్కచుక్క గూడ పుట్టదు. బాబూ! ఊళ్లో ఎవరన్నా యీ సారా అమ్మటం చూస్తే పంచాయతీవాళ్లు చర్మం ఒలిచేస్తారని గడగడ ఒణకి పోతున్నారు.

సురే:— హూ! ఎంత దౌర్భాగ్యం! ఎంత అరిష్టం! అయితే మన పీరాజసాహెబు శంకరం వీళ్లంతా యేం చేస్తున్నారురా?

రాము:— ఏం చేస్తున్నారా? పగలంతా యెక్కడో గని అంటా అదే ఆ సదాశివుడి కొండలో యినుము పడిందట. అడ పని చేస్తారు, ఒక్క వాడేమిటి ఊళ్లోవున్న అందరూ అక్కడికే పోతారు. దానికి బాబుగారు కొన్ని లక్షలు ఖర్చుపెట్టారంట ప్రభుత్వం కొన్ని లక్షలు యిచ్చిందట. మన వూరేమిటి. ఎక్కడెక్కడి వారూ యిక్కడికే వస్తున్నారు. అందరికీ కావలసినంత పని.

సురే:— ఆయితే. ఈ సంగతి యింతవరకు నాకుకూడ తెలీదే!

రాము:— అదే బాబూ మొన్నా మధ్య యెవరో భూములు తనిఖీ చేసే అధికారివచ్చి యీడ యినుమువుందని చెప్పాడట. అప్పటినుండి వీళ్లంత యిందులోకి దిగారు. ఎంతో లాభం కూడ వస్తోందట.

సురే:— ఆ!......అలాగా?......

రాము:— అవునుబాబూ! కూలికూడ రోజుకు 3 రూపాయల పైన యిస్తారట. అందరూ అక్కడికే పోతున్నారు పెద్ద తిరుణాల లాగ!

సురే:— ఆ! ఎంత వింత? హు! భద్రిన్ని అలా వదలితే యిక మనం భద్రంగ ఉండలేము. వాడిని మనవాళ్లతో చెప్పి యెముకలు పొడిపొడి చేయిస్తాను. హు! సింహం ముందు కుందేలు కుప్పిగంతులా? ఇక వీడికి పోయేకాలం దగ్గరకు వచ్చింది.

రాము:— బాబూ! ఇది విన్నారా? ఆ శంకరరంగాడు వాళ్లంతా పగలు పనిచేసి రాత్రిళ్లు చదువు కుంటున్నారు. ఇప్పుడు మన ఊళ్లో ప్రతివాడూ పత్రిక చదివేవాడే, నేను తప్ప. అదేదో వయోజన విద్యంట, అందరూ నేర్చుకుంటున్నారు. వీళ్లందరకూ భద్రంగారు దేవుడు.

సురే:— ఆ...దేవుడు, దయ్యము, భూతము, నేను చూస్తాను పగబట్టిన కోడె త్రాచుతో చెలగాటమా? అరే రాముడూ! నీవు సిద్ధంగా ఉన్నావా?

రాము:— అది కాదయ్యా!

సురే:— ఏమిట్రా కొయ్యా?

రాము:— నా పెండ్లి బాబూ! ఆ మాట యేంచేశారు!

సురే:— ఓ! నీ పెండ్లా! అదెంత సేపురా? నీ పెండ్లి చేస్తానులే. ముందు యీ పెండ్లి కానీ!

రాము:— ఏ పెండ్లి బాబూ?

సురే:— అదేనోయ్! భద్రం పెళ్లి. వాడి పెళ్లయితేగాని మనచేతికి డబ్బుచిక్కదు, ఆ డబ్బు చిక్కితేగాని నీ పెండ్లి చిక్కు తీరదు

రాము:— అయితే అదంతా యేమో మీరే కానివ్వండి. మా పెండ్లి మాత్రం త్వరగా కానిచ్చెయ్యండి.

సురే:— సరే! వెళ్లి నాకు భోజనం సిద్ధంచెయ్యి. ఇప్పుడే వస్తా (రాముడు నిష్క్రమించును). ఓహో! నాటకం బహు ఘాటుగా సాగుతున్నదే! ఇందులో ఏదో ఒక బూటకం చేస్తేగాని మనకోరిక తీరదు. (ఆలోచించును.) ఆ!... ఏ విధంగానైనా తండ్రీ, కొడుకుల మధ్య పగల సెగలు రగులు కొలపాలి. అప్పుడుగాని నీ పప్పు ఉడకదు... సురేష్!...తెలిసిందా? అయితే భద్రం యినుప గనికి కొన్ని లక్షలు యిచ్చాడా? అంటే Bank Balance బాలెన్సు తప్పిందన్నమాట మనమాదిరిగానే!

ఓహో!...ఈ దెబ్బతో....ఈ ఒక్క దెబ్బతో రెండు పిట్టలు నేలగూలాలి. బావగారు ఆదాయపు పన్ను కట్టాలిగా!

హు!...లే సురేష్! లే! నీపంట పండే సమయం దగ్గరకు వచ్చిందన్నమాట (అని మిగిలిన కొంచెము త్రాగి వేయును).

పారా హుషార్! ...... వస్తున్నది సింహం....... ఎక్కడి దొంగలు అక్కడే!...అక్కడే! ......... (అంటూ తూలుతూ నిష్క్రమించును).

—తెర—

# 8వ రంగము

[జమీందారు సోఫాలో కూర్చొని ఒక్కడే ముందున్న టేబుల్ మీద పేకాట ఆడుకుంటుంటాడు].

రాము:— (ప్రవేశించి) బాబయ్యగారూ!

జమీ:— ఏం రామయ్యగారూ?

రాము:— సురేష్ బాబయ్యగారు వచ్చారు!

జమీ:— ఓహో! వచ్చారా! రమ్మను! వెంటనేరమ్మను (సురేష్ ప్రవేశిస్తాడు). రా సురేష్! ఇలా కూర్చో! నీ దర్శనమే అపురూపం అయిపోయిందే! కాసేపు కబుర్లు చెప్పుకుందామన్నా చదరంగం వేసుకుందామన్నా మనిషికే కరువై పోయిందే!

సురే:— అదికాదుబావా! ఈ మధ్య పరిస్థితులు చాలా. దిగజారి పోయాయి, అందువల్ల నేనతి జాగ్రత్తగ ఉండవలసి వచ్చింది.

జమీ:— ఎమిటోయ్! ఆ పరిస్థితులు?

సురే:— ఏమని చప్పను బావా? ఒకటా రెండా! మన భద్రం పెట్టే దుబారా ఖర్చులు నా నా టికి పెచ్చుపెరిగి పోతున్నాయి.

జమీ:— అది నీవెప్పుడూ పాడుతున్న పాతపాటేగా! ఇప్పుడు కొత్తగా వచ్చిన ఉపద్రవం యేమిటంటా!

సురే:— బావా! ఇప్పటికి దాదాపు 500 ఎకరాలకుపైగా భూదానం కింద బుగ్గి అయిపోయింది. అద్దాల మహలు Cooperative Society కి, నౌకర్ల విశ్రాంతి మందిరం పాఠశాలకు, గుఱ్ఱాలశాల ప్రాథమిక ఆరోగ్యకేంద్రానికి... ఉన్నభవనాలు. భూములు అన్నీ దానాలకు ధర్మాలకు నాశనమై పోయాయి. మీదాకా రానివ్వటం యెందుకని మిన్నకున్నాను యిన్నాళ్లూ!

జమీ:— ఓహో! అదాసంగతి! ఇదివరకే చెప్పాను కదా! భూదానం చేయటం మా వంశాచారమే! ఇక అద్దాల మహాలంటే దాన్నిప్పుడు అనుభవించేవారెవరు? నే నేమో ఒంటరిని, వాళ్లేమో పసివాళ్లు. నౌకర్ల విశ్రాంతి మందిరం... మనకున్న నౌకర్లు నలుగురు, వారికి ప్రత్యేకంగా ఒక భవనం యెందుకు? ఉండేవారు మనతో బాటే ఉంటున్నారుగా! ఇక గుఱ్ఱాలశాల ప్రయోజనం మాత్రం యేముంది. ఉన్నవి రెండు గుఱ్ఱాలు, గుఱ్ఱపు పందాలు కూడవని ఉన్నవాటిని అమ్మివేశాముకదా? ఈ భవనాలన్నీ ఆ విధంగా పాడుపడి పోయేదానికన్నా యీ విధంగ సద్వినియోగం చేస్తున్నాడు అబ్బాయి. ఇంతకూ యిప్పుడూ నిన్నింతగా కంగారు పెడుతున్న కలవరపాటుకు నాకేమీ కారణం కనిపించటంలేదు. సురేష్!

సురే:— నీవు ఇలా అంటావనే నేనూ పోసిలెమ్మని ఊరు కొన్నాను. అయినా మనమెక్కడ? మన అంతస్థెక్కడ?

జమీ:— ఇప్పుడు మన అంతస్థుకు లోపమేమిటోయ్?

సురే:— మన భద్రం ......ఆ హరిజనులతో కలిసి...వాళ్ళ గుడిసెలలోకిపోయి... వాళ్ళతో కలిసి అన్నాలుతిని.... ఇదంతా యేం, ఖర్మం బావా? మన యింటా వంటా యెన్నడైనా ఉన్నదా? ఆ హరిజనులు ఎటుపోతే మన వాడికెందుకు చెప్పు?

జమీ:— పిచ్చివాడా! హరిజనులు మాత్రం మనుష్యులుకార్లా? వారిని కోస్తే రక్తం కారదా? మాలవాడు మడి దున్నించి పండించిన ధాన్యం పనికివస్తుందా? ఛండాలం అని అను కోకుండా మన కక్కసులన్నీ శుభ్రంచేయడానికి మాల వాడు కావాలా? జంతువులు చస్తే యీడ్చి పారేయడానికి హరిజనుడు రావాలా? కాని వాడి కంపే మనకంటగింపా? ఇదేనా న్యాయం? మనవాడు చేస్తున్న మంచి పనులను అర్థం చేసుకోకుండా వ్యర్థంగా బాధపడుతా వెందుకు సురేష్?

సురే:— మన భద్రం మీద నాకు యేమీ కోపంలేదు బావా! కాని లోకం అనేది ఒకటున్నది. మనం సమాజంలో మను ష్యుల్లాగా మెలుగుతున్నంతకాలం మన పరువు ప్రతిష్ఠ కాపాడుకోవాలా అక్కర్లేదా?

జమీ:—పరువుకు కరువా? ప్రతిష్ఠకు భంగమా? ఇప్పుడు ఇంతకూ యే మిన్ను విరిగి తలమీద పడిందోయ్.

సురే:— బావా మీరు పెద్దవారై పోయారు ఈ విషయాలన్నీ మీకుచెప్పి మీ మనసు నొప్పించటం నాకు యేమాత్రమూ యిష్టములేదు.

జమీ:— సురేష్! ఇవాళ నీ మాటలు యెంతో వింతగ ఉన్నాయి. నీవు చెప్పేదేమిటో నాకు అర్థమే కావటంలేదు. ఆ చెప్పే దేదో బిగ్గరగా చెప్పు.

సురే:— ఆ!.........ఏమీలేదు బావా!...ఏమీలేదు! (తడబడతాడు)

జమీ:— ఏమిటోయ్! ఆ తడబాటు చెప్పమంటుంటే!

సురే:— బావా ఏమని చెప్పను యీ నోటితో ఆ మాటలను మీముందు

జమీ:— (బిగ్గరగా) సురేష్: చెబుతావా? చెప్పవా.

సురే:— చెబుతానుబావా! చెబుతాను. లోకం అంతా కోడై కూస్తున్నది. ఎక్కడ చూచినా మన భద్రంపేరు మ్రోగి పోతున్నది.

జమీ:— అందులో ఆశ్చర్యం యేముంది? ఆనందించాలి పైపెచ్చు ఆనాడే అన్నానుగా!...

సురే:— ఏ గొప్ప తనానికైనా నీతి నియమం అంటూ ఉండాలి.

జమీ:— (కొంచెం ఆక్రోశంతో) ఏమిటామాటలు? వెఱ్ఱివాగుడు వాగుతున్నావు! నీతి నియమాలకు యేం భంగంవచ్చిం దిప్పుడు?

సురే:— బావా, ఒకతట్టు నిన్ను ఆయాస పెట్టడానికి యిష్టంలేదు. మరొకతట్టు చెప్పుకోక పోతే యీ మనోవ్యాధికి తట్టుకో లేనేమో అనిపిస్తుంది. పదిమంది నోట్లో పడింది, బయట పడక దాగుతుందా? (రహస్యంగా) ఊళ్లో అందరూ భద్రానికీ, చిన్ననాటినుండి మనింట్లో చాకిరీచేసి బ్రతికే చిన్నది శాంతికీ సంబంధం ఉన్నదని గగ్గోలుపెడుతున్నారు బావా.

జమీ:— ఆ!?

సురే:— నీవేమో యింట్లో ఉండేవాడివి. బయట వచ్చే పుకార్లు వినలేక, విని సహించలేక నేను బాధపడుతుంటాను ఇంతకూ చూడు బావా! మన అంతస్థుకు తగ్గట్టు నడుచు కోక పోతే నలుగురిలో నవ్వులపాలై పోమా?

జమీ:— ఊ! ఇంత దూరం వచ్చిందీ! ఏమో గ్రామాన్ని ఉద్ధ రిస్తున్నాడంటే సరేనని అన్నాను. ఇలా కుటుంబ గౌర వాన్ని మంటగలుపుతున్నాడు అంటే ఆనాడే అరికట్టిఉండే వాడివి. సరే వాణ్ణి పిలిచి మందలిస్తాను.

సురే:— అంతటితో ఉంటే బాగుందేదే! తాచెడ్డ కోతి వనమెల్ల చెరిచిందన్నట్లు ప్రేమ జీవితాన్నికూడ మంట గలుపుతున్నాడు మహానుభావుడు.

జమీ:— ఆ!... ...అదేమిటి?

సురే:— పాపం! అక్కయ్య చచ్చి యెక్కడ ఉందో! కడుపున పుట్టిన యిద్దరు పిల్లలు ముద్దు ముచ్చటెంతో పెరుగుతుంటే చూడలేకపోయినా, చనిపోయేటప్పుడు నన్ను పక్కకు పిలిచి ప్రేమను నాచేతిలోపెట్టి, 'తమ్ముడూ ప్రేమను నీదాన్నిగా చేసుకో' అంటూ కళ్లుమూసింది. ఆ నాటినుండి అరచేతిలో పెట్టుకొని పెంచాను ప్రేమను.

జమీ:— అందుకు యిప్పుడేమయిందోయ్!

సురే:— ఏం చెప్పను బావా? హంసతూలికా తల్పాలలో అందాలు బరిణెగ పెరగవలసిన ఆ సుందరి, కన్న శుంఠలతో శ్రమదానం అన్నపేరిట కాయకష్టంచేసి చమటోడుస్తుంటే కడుపులో చిచ్చు పెట్టినట్లౌతున్నది. అదలా ఉండనియ్యి! పోనీ మన అంతస్థు, మన గౌరవ ప్రతిష్ఠలు, తరతరాలుగ వచ్చిన మన ఆచార వ్యవహారాలు మన్నుగలిసి పోయినవే! షికార్లు కొట్టాలంటే తగిన మనుష్యులే లేరా? నన్ను తీసికెళ్ళమంటే ఏపార్కుకో బీచికో తీసికెళ్ళనా? కులమూ గోత్రమూ లేని ఆ శుంఠకాయ సుధాకరునితో వీధివీధినా, వాడ వాడనా తిరుగుతుంటే నా తల తీసేసినట్లయింది.

జమీ:— చాలు చాలు ఇక ఆపు!

సురే:— మీరిలా అయాసపడుతారనే మీకు ఇన్ని రోజులూ చెప్ప టానికి జంకాను, మీరు కాదు కూడదంటే విధిలేక చెప్పాల్సి వచ్చింది. కాస్త మందలిస్తే వాటంతట అవే సర్దుకుంటా యనుకుంటాను.

జమీ:— ఊ...మందలిస్తా! చక్కగ మందలిస్తా! ఓరేయి ఎవరురా అక్కడ.

రాము:— (ప్రవేశించి) బాబయ్యా!....

జమీ:— చిన బాబును వెంటనే...

రాము:— బాబయ్యా! తహసీల్దారుగారంట. బాబుగారి దర్శనము కోసం వచ్చియున్నారు

సురే:— బావా! నీవు కూర్చో. విషయం యేమిటో విచారించి వస్తా (పోవును)

జమీ:— సురేష్ మాటలు వింటుంటే ఒళ్లు భగ్గున మండుక పోతున్నది. చిరంజీవి యెన్ని పనులు చేసినా, ఎంత డబ్బు ఖర్చుపెట్టినా అవినీతి మార్గంలో అడుగెట్టడని అంతరాత్మచాటి చెప్పుతూంది. ఏది నమ్మటము? ఏది నమ్మకపోవుటము?

(సురేష్ చేతిలో కాగితాలతో ప్రవేశించును)

జమీ:— ఏమి సురేష్? తహసీల్దారు యెందుకు వచ్చినట్లు?

సురే:— ఆ! ఏమీలేదు బావా! చిన్న విషయం. ఏదో లక్షయాభై వేల Income Tax పాతబాకీఉందట. దాని విషయమై వచ్చాడు.

జమీ:— అందుకు నాదాకా రావటం యెందుకు? భద్రాన్ని అడుగుతే పరిష్కరించడూ?

సురే:— పరిష్కరించాడు!

జమీ:— మరింకేమి?

సురే:— కాని యిచ్చిన చెక్కు మారలేదుట.

జమీ:— అదేమిటోయ్? చెక్కు మారక పోవటమేమిటి?

సురే:— Bank Balance సున్నా అని చెక్కు తిరగ్గొటేశారట.

జమీ:— ఏమిటీ! 30 లక్షల Bank Balance మూడేళ్ళలో ముగించేశాడూ.

సురే:— 30 లక్షలేమిటి బావా? మూడు కోట్లయినా చాలవు అబ్బాయిగారి అనవసరపు ఖర్చులకు.

జమీ:— అయితే నన్నేం చేయమంటాడు తహసీల్దారు?

సురే:— చెక్కు మారలేదుకదా! చరాస్థి జప్తీ అయినా చేసి యుంచితే తనకు మాట లేకుండా ఉంటుందంటున్నాడు. పెద్ద వారింటి విషయం కదా అని స్వయంగ వచ్చారట. (షాకు తింటాడు.)

జమీ:— ఏమిటీ! చరాస్థి జప్తీయా! నేను బ్రతికుండగానే యింత గతి పడుతుందనుకోలేదు. జమీందారీ చట్టంవచ్చి రాజ్యాన్ని పోగొట్టుకుంటే దుఃఖించలేదు. 'రోజులు మారాయి' అనుకున్నాను. కడుపున బుట్టిన కొడుకు కన్నవారితో కలిసి కాలక్షేపం చేస్తున్నాడంటే కలవర పడలేదు. 'కాలవైపరీత్యం లెమ్మని' అనుకున్నాను. సరదాగా పరదాలలో ఉండిన సతీమణులు సామాన్య స్త్రీలతో కలిసి సకల కార్యాలు సాగిస్తున్నారంటే సరే లెమ్మని కిమ్మనకుండా ఊరుకొన్నాను. ఇది భరించరాని అపమానము. ఈ అపమానాన్ని భరించి జీవించడంకన్న ఆత్మహత్య చేసుకోవడం మేలు. ఇంతకూ చిరంజీవిని పిలిపించి యీ నాటకమంతా యేమిటో ముఖాముఖినే అడిగి తెలుసుకుంటాను.

సురే:— ఒరేయి రాముడూ! నీవువెళ్లి చినబాబుగారిని అయ్యగారు రమ్మంటున్నారని చెప్పు.

రాము:— చిత్తం బాబయ్యా! (నిష్క్రమించును).

జమీ:— సురేష్! నిజంగానే Bank Balance వున్నా అయిందంటావా?

సురే:— కాకుంటే బ్యాంకివారు చెక్కు లెందుకు తిరగ్గొడుతారు బావా?

జమీ:— మూడేళ్ళలో 30 లక్షలు వెదజల్లినా ఖర్చు కాదే!

సురే:— అదేమిటి బావా! నే నప్పటికప్పుడే చెప్పుతూవచ్చాను. మీరు పెడచెవిని పెడుతూ వచ్చారు. 30 లక్షలు ఖర్చు కాకుంటే ఆ ప్రసూతికేంద్రాలు, ఆ విద్యా సంస్థలు. ఆ పార్కులు, డి యో లు, సిమెంటురోడ్లు, కుళాయిలు, హరిజనకాలనీలు, ఇవి, ఇంకా యెన్నెన్నో యెలా వచ్చాయంటారు? ఇదేమన్నా మంత్రమా? మాయమా?

[భద్రం ప్రవేశిస్తాడు భద్రాన్ని చూడగనే జమీందారు ఆవేశంతో రొప్పుతుంటాడు, సురేష్ వెకిలినవ్వుతో ఆహ్వానిస్తాడు.]

జమీ:— (ఆవేశం అణచుకొని) ప్రెసిడెంటుగారూ దయచెయ్యండి!

భద్ర:— (విస్తుపోతూ) అదేమిటి నాన్నగారూ! నన్నంత గొప్ప చేస్తున్నారు! నేను మీ కడుపునపుట్టి మీచెప్పు చేతల్లో పెరిగి మీ అడుగు జాడలను అనుసరించే మీ భద్రాన్నేగా!

జమీ:— అవును. దేశోద్ధారకుడవు. ప్రపంచంలోనే పరిణామం తేవడానికి పుట్టిన పరమ పురుషుడవు. నా వంశగౌరవ ప్రతిష్ఠలను అగ్నిదగ్ధం చేయడానికి అవతరించిన అవతార మూర్తివి. తేనెపూసిన కత్తిఅని తెలుసులేక పోయాను.

భద్ర!— (భయంతో) నాన్నగారూ! మీరు పొరపడుతున్నారు. నా మాట...

జమీ:— ఇక మాట అక్కర్లేదు. మంతీ అక్కర్లేదు. అంతా తేట తెల్లంగ తేలిపోయింది. తరి భూముల నన్నిటినీ ఊరి వారికి పంచియిచ్చావా?

భద్ర!— అవును. అందుకు మీ ఆమోదం ఉందనుకున్నాను.

జమీ:— అద్దాల మహాలు Cooperative Society కి అప్ప గించావా?

భద్ర!— (అవునన్నట్లు తలయూపును)

జమీ:— నౌకర్ల విశ్రాంతి మందిరం పాఠశాలకు యిచ్చావ

భద్ర:— (తలయూపును) అవును.

జమీ:— గుఱ్ఱాలశాల ఆరోగ్యకేంద్రానికి అర్పించావా?

భద్ర:— (తలయూపును).

జమీ:— Bank Balance 30 లక్షలు ముగించేశావా!

భద్ర:— లేదు నాన్నాగారూ!

జమీ:— ఏమిటోయ్ లేంది? ఏడుతరాలకీతట్టు ఆతట్టు యెన్నడూ లేంది యీనాడు, యీ నగరిలో చరాస్థి జప్తీకి తహసీల్దారు మన యింటికి.........మనయింటికి వచ్చాడంటే ఇంతకన్న ఋజువేంకావాలి?...పోనీ...మన యింట్లో చాకిరీచేసే చిన్నది శాంతి నీతో సంఘసేవ అనే నెపంతో వాడవాడనా వీధివీధినా నీతో కలిసి తిరగడంలేదూ?

భద్ర:— నాన్నా!......అదీ......

జమీ:— అదీ! ఇదీ! ఊర్లో అందరూ యేమనుకుంటున్నారో తెలుసునా?

భద్ర:— (ఆశ్చర్యంతో చూస్తాడు).

జమీ:— నీకూ దానికీ సంబంధం ఉందని ఊరంత అట్టుడికినట్టుడికి పోతున్నది. నీగతి యేమయితేనేం? తల్లిలేనిపిల్ల. పెండ్లి కావలసిన పిల్ల ఈడువచ్చిన ఆడుది....ప్రేమ జీవితాన్ని కూడ పాడు చేస్తున్నావుకదరా దౌర్భాగ్యుడా!

భద్రం:— నాన్నా!......

జమీ:— ఇంకా నాన్నా అని పిలవడానికి నీకు నోరెట్లా వస్తున్నదిరా?...అల్లారుముద్దుగా పెంచానా? నీవు అడిగిందల్లా

తెచ్చియిచ్చానా? దానికి యిదా నీవు చూపే కృతజ్ఞత! కులగౌరవాన్ని కూలద్రోసిన కొడుకు ఉండినా ఒకటే మండినా ఒకటే. నిన్ను చూస్తుంటే నాకు రోత పుట్టు కొస్తున్నది. ఇన్ని అవినీతి పనులుచేసి అడిగిన ప్రశ్నలకు బదులు చెప్పకుండ బుద్ధావతారంగా కూర్చున్నావు. ఛీ నీ ముఖంచూస్తే పాపంకూడ వస్తుంది. ఫో అవతలకు. ఈ యింట్లో నీకు తావులేదు (అని చెంపమీద ఛళ్‌మని కొట్టి విసురుగా వెళ్లిపోవును. జమీందారు వెనక వెకిలి నవ్వు నవ్వుతూ సురేష్, రాముడు నిష్క్రమింతురు.

భద్రం:— ఆహా! ఈ రోజు యెంత దుర్దినం! ముట్టుకుంటే కంది పోతానని కుందిపోయే నాన్నగారు నాపైన చెయ్యిచేసు కున్నారే! ధర్మరాజులాంటి నాన్నగారు ధర్మా ధర్మాలను విచారించకుండా వివరించ పోయేది వినకుండా అనరాని మాటలన్నీ అన్నారే!

అయినా నాన్నగారు నన్నుకొట్టినా తిట్టినా నాకేకొరతలేదు [నన్ను అనవసరంగా అపార్థం చేసుకున్నాడు.] ఆయన మనస్సు ఎంతగా వంతపడిందో! లేకుంటే నన్ను... నన్ను నాన్నగారు యిలా అవమానపరుస్తారా, అనుమా నిస్తారా! అపనిందల పాలుచేస్తారా? ఇందులో యేదో మోసం వుంది. నిజం నిలకడ మీద గాని తేలదు.

ప్రస్తుతం నాన్నగారి కోపాగ్ని చల్లారిందాకా యింటినుంచి వెళ్లిపోవడంకన్నా వేరే మార్గం యేమీ కనుపించదు.

ప్రేమ:— అన్నయ్యా! అన్నయ్యా! ఎక్కడకన్నయ్యా? నీవు వెళ్లొద్దన్నయ్యా నామాట వినవూ?

భద్ర:— చెల్లీ.

ప్రేమ:— అన్నయ్యా! (ఒకరినొకరు కౌగలించుకొందురు).

భద్ర:— చెల్లీ! నాన్నగారు అనవసరంగా మనసు పాడుచేసుకున్నారు. ప్రస్తుతం నాకు యింటినుంచి వెళ్లిపోవడంకన్నా వేరే గత్యంతరం లేదు.

ప్రేమ:— ఏదో! ఆవేశంలో అన్నారుకాని, నాన్నకు నీమీద ఎంత ప్రేమో నీకు తెలీదా అన్నయ్యా?

భద్ర:— అవునమ్మా తెలుసు. తెలియబట్టే ఇంత బాధపడుతున్నాను. నేను వెళ్తున్నాను. నీవు జాగ్రత్తగ ఉండు.

ప్రేమ:— నేనూ నీతోటే వస్తానన్నయ్యా!

భద్ర:— వద్దమ్మా! నాన్నగార్కి ఆసలే మనసు బావుండలేదు. నీవైనా దగ్గరఉండి ధైర్యం చెప్పు, నేను యిక్కడే ఉంటానుగా! యువజన సమితి కార్యాలయంలో వుంటాను. తిరిగీ నాన్నగారికి నామీద కోపంతగ్గి యెప్పుడు నన్ను అనుగ్రహిస్తారో అప్పుడు వెంటనే ఆయన పాదాల దగ్గరకు వచ్చివాలనూ? నాన్న యెంత మంచివాడో నాకు తెలీదూ! వస్తా చెల్లీ! లోపలికి వెళ్లమ్మా! జాగ్రత్త!

—తెర—

## 9వ రంగము

[సురేష్ సంతోషంతో యీలపాట పాడుకుంటూ హుషారుగా ఉంటాడు, అంతలో రాముడు ప్రవేశిస్తాడు]

సురే:— ఏరా రాముడూ? అలా ఉన్నావేరా?

రాము:— అది కాదయ్యా!

సురే:— ఏమిట్రా పెయ్యా? ఇక మన చేతికి అడ్డు లేదు. మన ధాటికి యెదురులేదు. మనం కావాల్నంటే కొండమీది కోతైనా దిగిరావలసిందే! ఇంకా నీకు భయం యెందుకురా?

రాము:— భయమేమీ లేదు. కాని భద్రంబాబు......

సురే:— అహహా! భద్రంబాబుగారు! ఇంకా యెక్కడి భద్రం బాబురా? ఇంటినుండి గెంటివేయబడ్డాడు, కన్నతండ్రి కాల దన్నాడు, ఇంక "ప్రేమ" మనది.

రాము:— నన్నుకూడ కలుపుతారెందుకు బాబూ?

సురే:— హ్హా! హ్హా! మనదంటే నాదిరా! శాంతి నీది!

రాము :— బాబయ్యా!

సురే:— ఏమిట్రా రామయ్యా!

రాము:— ఇది విన్నారా?

సురే:— ఏమిటిరా?

రాము:— భద్రంగారు యెప్పటిలాగే పనులన్నీ చక్కగా సాగిస్తున్నారట. పంచాయితీ సభ్యులందరూ ఆయనను నెత్తిన పెట్టుకొని పూజిస్తున్నారట.

సురే:— వాడికి అంతగౌరవమా యింకా?

రాము:— ఇప్పుడు యింకా యెక్కువయింది బాబూ! వారు కట్టించిన Factory నుండి రోజుకు రోజు యినుము కుప్పలు తెప్పలుగా వస్తున్నదట. వచ్చేలారీలు పోయే లారీలు, ఊరినిండా వాటి బుఱ్ఱు బుఱ్ఱు శబ్దాలే!

సురే:— ఆ!......?

రాము:— ఆ ఏమిటి బాబూ! వెనుకటి మన స్నేహితులంతా అందులో దిగి యెంతెంతో ఆర్జిస్తున్నారు. వారు యినుము పై కెగుమతి చేస్తున్నారట. ఎంతెంతో లాభం వస్తున్నదని అనుకొంటున్నారు అందరూ!

సురే:— ఆహా! తలచింది ఒకటైతే జరుగబోతున్నది ఒకటి. అంతడబ్బు వస్తే దానిమీద భద్రం తిరిగి పైకి వస్తాడు.

ఏనాటికైనా బావకు తెలుస్తుంది. బావకు తెలిస్తే మనకు చావు తప్పదు. (ఆలోచించును)

రాము:— బాబయ్యా!

సురే:— ఓరే రాముడూ! ఇలా దగ్గరకురా! బాగ ఒళ్లుదగ్గరపెట్టుకొని మరీవిను నేను చెప్పేది.

రాము:— ఒళ్లు దగ్గరే ఉంది. చెప్పేది చెప్పండి:

సురే:— ఒళ్లూ కళ్లూ మెదడూ గిదడూ అన్నీ దగ్గర పెట్టక విను. రేపు రాత్రికి మన స్నేహితులందరినీ కూడగట్టి ఆ Factory కి డైనమైటు పెట్టి బద్దలు చేసెయ్యాలి. ఊఁ.........?

రాము:— అమ్మ బాబోయ్! (ఎగిరి పడును) ఇంకేమన్నా ఉందా? బాబుగారికి తెలుస్తే మన ప్రాణాలు యెగిరి పోవూ?

సురే:— పిరికి పందలా మాట్లాడుతావేరా? 'ధైర్యే సాహసే లక్ష్మి' అన్నారు పెద్దలు.

రాము:— ఈ పని నావల్లగాదు బాబూ! మీరింకేమన్నా చెప్పండి చేస్తాను.

సురే:— ఒరేయ్! రాముడూ! నీ ప్రాణానికి నాప్రాణం అడ్డు వేస్తాను. ఇది ఒక్కటి. నెరవేరుస్తే మన కష్టాలన్నీ నెరవేరినట్లే! నామాట విను. ఇక మీదట నీవు శాంతితో శాంతంగా హాయిగా కాలం గడుపవచ్చు. 'మన' ముఠాతో చెప్పి సిద్ధంగ ఉండు, ఆ తెలిసిందా? రేపురాత్రికి!

రాము:— సరే బాబూ! అట్లాగే చెబుతాను. అన్నిటికీ మీరే ఉన్నారు.

—తెర—

---

# 10వ రంగము.

[రాజవీధి, ఉదయం పదిగంటలు, రాముడు సూటు బూటు హేటు వేసుకుని హుషారుగా పాడుకుంటూ నడుస్తుంటాడు.]

శాంతమ్మ పెండ్లికూతురాయెనే—
యీ-రామయ్య పెండ్లి కొడుకాయెనే॥
శాంతమ్మ పెండ్లీ రామయ్యపెండ్లీ
చూతాము రండీ కానుకలు తెండీ ॥శాం॥

బాకాలు పూదే బాజాలు మోగే
సన్నాయిసాగే విన్నారమీరు
ఓ పెద్దల్లార ఓ పిన్నల్లార
మీరంతా రండీ మరువా వద్దండి ॥శాం॥

ఈ పెండ్లి విందు యెంతో పసందు
జాంగీరు లడ్డు లేదండి అడ్డు
ఇష్టాగ్రింగు కాఫీ తాగి చూడండీ
వేడేడి యిడ్లి వేవేగ రండి ॥శాం॥

[పాట చివరిలో అవస రవసరంగా వస్తున్న శాంతి యెదురౌతుంది]

శాంతి:— ఏం రాముడూ?

రాము:— (కోపంతో) రాముడూ?... ఏం బొడ్డుకోసి పేరు పెట్టావా? రామయ్యా అని పిలువలేమిటి?

శాంతి:— ఓహోహో! పోనీలే! ఏదో అలవాటుకొద్దీ అన్నాను. ఇకమీదట రామయ్యగారూ అంటాలే!

రాము:— సరే! అంతేలే! ఇదివరకు అలవాటుగా అంటే అన్నావు గాని యింకమీదట అలాంటి పొరబాటు చేయకు.

శాంతి:— అదేంటి రామన్నా?

రాము:— మళ్లా రామన్నా అంటావు? అన్నా యేమిటిఅన్నా? నీతో కూడా బుట్టానా? అంటే బావా అను, లేకపోతే మామా అను.

శాంతి:— ఇంతకూ యేమిటీ గిరాకీ? ఇవాళ చాలా హుషారుగా ఉన్నావు! సూటుబూటు వేసి అచ్చం దొరలా తయారయ్యావే! నిన్ను చూస్తుంటే అసలుకి నా మనసులో యెట్టెట్టనో ఉంది.

రాము:— నిజంగా? నిజమే నంటావాంట?

శాంతి:— కాకుంటే నీతో అబద్ధాలాడు తానా? నీతోడు.

రాము:— జమీందారు గారింట్లో కన్న చాకిరీ చేసి వారి ప్లేట్లల్లో యెంగిలి మెతుకులు మెక్కే జీవితం మారింది. సురేష్

బాబుగారి చలవ అంటూ నేనూ ఒక మనిషిగా మారాను. డబ్బు ఒక్కటుంటే దుస్తుల గౌరవానికి లోటుండదు.

శాంతి:— అందుకే డబ్బులేని వాడు డబ్బుకి కొరగాడంటారు పెద్దలు, అయితే సురేష్ బాబు నీమీద కనక వర్షం కురిపిస్తున్నారన్న మాట!

రాము:— కనకవర్షమేమిటి? కావాలంటే కాసుల వర్షమే కురిపిస్తారు. భద్రంబాబు యిల్లువిడిచి యెల్లిపోయారుగా! సురేష్‌బాబు మళ్లా యింటికి యజమాని. వారికి మనం నమ్మిన బంటు. ఇక కనకానికీ కాసులకూ కొదవేమిటి?

శాంతి:— అలాగా బావా?

రాము:— అంతేకాదు, మనకు కొద్దిరోజుల్లో పెండ్లికి కూడ అన్నీ తయారు చేస్తున్నారు సురేష్ బాబుగారు.

శాంతి:— ఆ?.......మనకంటే?

రాము:— అంటే....నీవు పై అంటే నీకునాకూ! లేకుంటే నాకూ యింకే చక్కని చుక్కకో!

శాంతి:— ఇంతదూరం వచ్చాక యింకా నై అనక పోవటమేమిటి బావా! అయితే వారికి నీమీద యింత అభిమానం ఎందుకు బావా?

రాము:— అదంతా చాలా ఉందిలే....సురేష్ బాబుకు నేనంటే పంచప్రాణాలు. రేపటితో అన్నీ చక్కబడుతయి.

శాంతి:— ఏం? రేపు మంచి ముహూర్తం పెట్టుకున్నారేమిటి సదుపాయాలు సమకూర్చుకోవటానికి?

రాము:— ఆః ఆః...అదంతా ఓ పెద్దకత. ఎవ్వరికి తెలీకూడదు.

శాంతి:— నాక్కూడానా?

రాము:— నీకే కాదు. బ్రహ్మదేవుడికి కూడా అంతే!

శాంతి:— అంతేలే బావ! ఇంతమాత్రానికే అనుమానించేవాడు కట్టుకొన్నతరువాత యేం కట్ట బెట్టుతావని? మగవారి మాటలన్నీ యిలాగే వుంటాయి. మాయదారి మాటలు.

రాము:—అదికాదు శాంతీ! నిన్ను అనుమానిస్తున్నానని కాదు. అసలే ఆడవారి నోట్లో నువ్వుగింజ దాగదన్నారు పెద్దలు, కొంపదీసి నీవు నోరు జారితే నాకొంప అంటుకొన్నట్లే!

శాంతి:— (దగ్గరకు వచ్చి భుజంమీద చేతులువేసి) నీవు యెంత మంచోడివిబావా! నీ కొంప అంటుకుంటే ఒకటీ నా కొంప అంటుకుంటే ఒకటీనా? రేపటినుండీ మన యిద్దరి కొంపా ఒకటేకదా! నీకేం భయంలేదు! ఎవ్వరికీ చెప్పనులే! చెప్పు బావా? (ముద్దుగా)

రాము:— ఎవరికన్నా చెప్పేవు సుమా! దగ్గరకురా (అని చెవిలో గుసగుస లాడును).

శాంతి:— భేష్! మంచియోచన. లేకుంటే యీడబ్బున్న పెద్దలకు బుద్ధిరాదు. ఆ! అన్నట్టు మర్చేపోయాను. ప్రేమమ్మగారు బజారుకు పోయి త్వరగా వచ్చెయ్యమన్నారు. వస్తా!...

రాము:— మరి ఒక ముద్దియ్యవూ?

శాంతి:— ఇది బజారు బావా! రేవు వస్తాగా! టా! టా!

రాము:— టా!......టా!......

——తెర——

# 11వ రంగము

[యువజన సమితి కార్యాలయం, భద్రం చరఖా త్రిప్పుతూ పాట పాడుకుంటుంటాడు.]

ఒక్కొక్క వ్యక్తి సాంఘిక శక్తి
ఒక్కొక్క గ్రామం ఆనంద ధామం
పంచాయతీ రాజ్య పాలనములో
సాంఘిక సంక్షేమ సౌధమ్ములో ॥పం॥

ఓ పేద రైతా
ఓ భూమి నేతా
నీదేను రాజ్యం
నీదే స్వరాజ్యం ॥పం॥

ఈ నాటి త్యాగం
మరునాటి భోగం
అలనాటి భాగ్యం
కలిగే నవశ్యం ॥పం॥

లే లెమ్ము విదురా
నీదేను కదురా
ఈ దివ్య దేశం
ఈ భవ్య దేశం ॥పం॥

[ పాట చివరలో సుధాకర్ ప్రవేశిస్తాడు. ]

సుధా:— భద్రంగారూ! మాకోసం మీ క్షేమాన్ని వీసం అయినా లెక్కించకుండ చివరకు యెన్ని కష్టాల పాలయ్యారండీ!

భద్రం:— ఇప్పుడు నాకు వచ్చిన కష్టాలేమున్నాయి? మనం ఒక ఆదర్శంతో పనిచేస్తున్నపుడు ఎన్ని అడ్డంకులు వచ్చినా, ధైర్యంగ నిలచి పనిచెయ్యాలి. అప్పుడుగాని మన లక్ష్యలను సాధించుకోలేము.

సుధా:— పొగడుతున్నానని కాదు. పరులకోసం కన్నతండ్రితో పగ తెచ్చుకున్న స్వార్థ త్యాగులెవరుంటారు చెప్పండి?

భద్రం:— ఇప్పుడు నాన్నగారికి నాకు పగ యేముంది? ఏదో ఆవేశంలో అన్నారు అంతే! ఇప్పుడు దానికేంలే! ఇంతకూ మన పనులు యెలా సాగుతున్నాయి.

సుధా:— పనులకేం సవ్యంగానే సాగుతున్నాయి. అయితే భద్రంబాబూ ఇప్పుడు మనదేశం భద్రంగా వున్నది కదా! దొంగతనాలు దోపిడీలు ఖూనీలు యిత్యాది నేరాలు యెక్కడా జరుగటం లేదుకదా! మన పోలీసువారితో యేం చేయించాలంటారు?

భద్రం:— మంచి ప్రశ్నే అది. ఇది నేనిదివరకే కొంచెం ఆలోచించాను. ఇప్పుడు కూడా పోలీసులు తమ దేహబలంతో పాటు బుద్ధిబలాన్ని ఉపయోగించి ,చేసే పనులు యెన్నో

ఉన్నాయి. మందుల Factory లో జరిగే కల్తీ వ్యాపారాలను, తదితర కార్మాగారాలతో జరిగే అన్యాయాలను పట్టుకోవచ్చు. తీరిక సమయాలలో వారూ ప్రజలతోకలిసి శ్రమదానంచేసి ప్రజోపయోగకరమైన పనులలో పాల్గొనవచ్చు.

సుధా:— మరి యీ పనులలో వారిని నియమిస్తుంటే అసలు పోలీసు విధులనే అనతికాలంలో మర్చిపోతారేమో! అప్పుడు యే మారు మూలనన్నా ఖర్మంజాలక అశాంతి బయలుదేరిందా మనకు అరికట్టే అవకాశం ఉండదు.

భద్రం:— సుధాకర్! ఈ విషయం నాకు తెలియక కాదు. అందుకనే వారికి అనుదినం యిచ్చే శిక్షణ తప్పకూడదు. అవసరమున్నప్పుడు ఆదుకునే అగత్యం యెంతైనా ఉంటుంది! వారి తర్ఫీదు యెప్పటిలాగా జరిగితీరాలి. ఈ శిక్షణ ఒక్క పోలీసులేకాదు. యువజనులగు మనమందరూ పొందాలి. అందుకనేగా మన ఊరిలో అందరినీ లోకసహాయక సేవలో చేరమని ప్రాధేయపడడం!

సుధా:— అది బాగానే ఉంది. మనం పంచాయితీరాజ్యం వచ్చింది ప్రజల బాధలు తీరాయి అని చెబుతున్నామే! కాని ప్రజలకు యీ పన్నులభారం తగ్గేమార్గము లేనేలేదంటారా?

భద్రం:— సుధాకర్! ఇక్కడ మనం గుర్తుంచుకోవలసిన ముఖ్య విషయం ఒకటున్నది. మన గ్రామంలో పంట పండు

తున్నదనుకో! ఆ పంటను యెక్కువ లాభం వస్తుందనే మక్కువకొద్దీ పై వూళ్ళకు తరలిస్తుంటాడు వర్తకుడు. అలా పరాయి వూళ్ళకు పోయే ధాన్యం మొదలైన సరకుల మీద యెక్కువ పన్నువేస్తే వాళ్ళకు చివరకు మిగిలేది లాభం వుండదు. అందుకని మందు మన గ్రామంలోనే అమ్ముకుంటాడు. ఈ విధంగానే ప్రతి పంచాయితీ పని చేస్తే యేవూళ్లో యేకొరతా వుండదు.

సుధ:— ఇక ఊరికి ఊరికి ఉన్న సరిహద్దు తగాదాలు మనలో తరతరాలనుండీ వస్తున్నాయి. మొన్న చూశారుగా ఈ నెపాన్ని మనసులో వుంచుకొని కార్తీక పౌర్ణమినాడు దివిటీలు చేతబట్టుకొని మనవూరిపై కురికారు. ప్రక్క ఊరి ప్రభువులు, కోర్టుకు వెళ్తే కొల్లబోవలసిందే! వారు రెచ్చగొట్టిన దానికి సరిగా మనవాళ్లూ బయలు దేరితే ఆ రోజు తలలు నేలకూలి యుండేవే! ఈ ఖర్మతీరేది యెప్పటికో!

భద్ర:— నేడు యీ సరిహద్దుల సమస్య గ్రామగ్రామానికీ మధ్యనే గాకుండా రాష్ట్ర రాష్ట్రానికీ దేశదేశానికీ తీరని సమస్య అయిపోయింది. గ్రామాలకు మధ్య తగాదాలను మాత్రం మన పంచాయతీ సమితి President లు అందరూ కలిసి ఏర్పడిన జిల్లా పరిషత్తు ఉన్నదే! దానికి వదిలేస్తే వారే తీరుస్తారు. ఏమంటావు

సుధా:— అదీ మంచిమార్గమే!

(శాంతి రొప్పుకుంటూ రోజుకుంటూ ప్రవేశిస్తుంది).

భద్ర:— ఏమిటి శాంతీ! అంత హడావుడిగా వస్తున్నావు?

సుధా:— ఏమిటి చెల్లీ అంత కంగారు?

శాంతి:— ఏం చెప్పను అన్నయ్యా! పెద్ద ప్రమాదం... మనం త్వరగా మేలుకోవాలి.

సుధా:— ఏమిటమ్మా యింతకూ?

శాంతి:— అన్నయ్యా! రేపురాత్రి సురేష్‌బాబు వాళ్లు అందరూ కలిసి డైనమైట్లతో మన Factory ని బద్దలు చేస్తారట.

సుధా:— ఆ!?... .......

భద్ర:— ఆ......ఎంత అఘాయిత్యం! ఎవరు చెప్పారు శాంతీ నీకు?

శాం:— ఇంకెవరు? మీరు వచ్చేసిన తరువాత యిల్లు సురేష్‌బాబు గారి పెత్తనం కిందకు వచ్చిందికదా! ఆయనగారి భక్తుడు రాముడు......వాడు చెప్పాడు!

భద్ర:— అంత రహస్యాన్ని నీకెలా చెప్పాడు?

శాంతి:— [సిగ్గుతో] వాడిని పెండ్లాడుతానని బుజ్జగించి మోసగించి యీ రహస్యాన్ని పెకలించ గలిగాను.

భద్ర:— ఎంత తెలివైన పని చేశావు? లేకపోతే యెంత ప్రమాద
జరిగేది!

సుధా:— ఇంతకూ మనం చేయవలసిన పనేమిటో ఆలోచించండి
బాబూ!

భద్రం:— మనం ముందుగానే అక్కడకు పోదాము. వెంట
పంచాయితీబోర్డు సభ్యులనుకూడ తీసుకొనిపోదాము. ఆప
చెయ్యక ముందే పైనబడి పట్టుకొందాం! తరువాత ప
అంతా పంచాయితీసమితే పూర్తి చేస్తుంది.

సుధా:— బాగుంది, అలాగే చేద్దాం!

భద్రం:— పోదాం పదండి యింక...!

—తెర—

# 12వ రంగము

[ జమీందారుగారి వరండా! జమీందారుగారు సోఫాలో కూర్చొని పత్రిక చదువుతూంటాడు. నౌకరు రాము కంగారుగా పరుగెత్తుకుంటూ వచ్చి జమీందారుగారి కాళ్లు గట్టిగా పట్టు కుంటాడు. ]

రాము:— బాబ్బాబు,..... రక్షించండి బాబూ!......

జమీ:— అరే! యేమిట్రాయిది?.... ఏమిట్రా రక్షించేది?

రాము:— బాబ్బాబు బుద్ధి గడ్డితిన్నది, అయిన యిందులో నా తప్పేమీలేదుబాబూ! అంతా సురేష్ బాబుగారు చెయ్యమంటే చేశాను.

సురే:— (ప్రవేశిస్తూనే జమీందారు కాళ్ళమీద వాలుతాడు.) నన్ను క్షమించు బావా! నేనే అంతా చేసింది! నిజంగా నేను మీకు తీరనిద్రోహం చేశాను. నన్ను దేముడు కూడ క్షమించడు.

జమీ:— అబ్బబ్బా!... ఏమిట్రా. మీ అర్థంలేని వాగుడు. నాకు మీ మాటల్లో ఒక్క ముక్కకూడ తెలీటంలేదు.

సురే:— ఏమని చెప్పను బావా? నా పాపం ప్రద్దలయింది. డైన మైటుతో మన ఫ్యాక్టరీని బద్దలుచేయాలని ప్రయత్నించి పట్టుబడ్డాను.

జమీ:— మన ఫ్యాక్టరీయా? !

సురే:— అవును బావా! నేను మీకు తెలిసికూడ నిజం చెప్ప లేదు. భద్రం ఉన్నడబ్బంతా యీ Foctry లో పెట్టాడు. దానివల్ల ఎంతోమంది బ్రదుకుతున్నారు. అదీకాక మంచి లాభాలుకూడ వస్తున్నాయి. ఇవన్ని చూసి ఓర్వలేక యీ పాపానికి ఒడిగట్టాము. క్షమించు బావా!

జమీం:— ఛీ! దుర్మార్గుడా! ఇంకా యేముఖంతో యిక్కడకు వచ్చావు తిన్నింటి వాసాలకు లెక్కబెట్టే నీచుడవు. మీ అమ్మానాన్నా చిన్నప్పుడే పోయారని చేరదీసి పెంచి నందుకు యిదా నీవుచేసిన మేలు! కన్నకొడుకును నీ మూలంగా యింటినుండి గెంటివేశాను! ఫో ముందు... నా యెదుటినుండి పోతావా పోవా!

సురే:— బావా నేను పూర్తిగా మారిపోయాను, భగవంతునితోడు. నా నేరాన్ని భద్రంవాళ్ళు జిల్లాపరిషత్తుకు పంపించారు, వారు నా పశ్చాత్తాపాన్ని చూసి భద్రం కోరికమీద వదలి పెట్టారు.

[ప్రేమ ప్రవేశించును.]

జమీం:— వచ్చావా తల్లీ! ఈ దుర్మార్గుడు యెంతపనిచేశాడో చూశావా అమ్మా!

ప్రేమ:— అవును నాన్నా! నాకు అన్నీ తెలుసు. అన్నయ్యను బయటికి పంపించడం న్యాయంకాదని తెలుసు. అయినా ఆ ఆవేశంలో మీరు చెప్పినా వినరని నోరు విప్పలేదు.

జమీం: ఆ!...ఎంతపని చేశాను దుర్మార్గుణ్ని!

ప్రేమ:— ఎందుకు నాన్నా అలా బాధపడుతారు? అన్నయ్య కట్టించిన ఈ ఆరోగ్యకేంద్రాలు, యీ పాఠశాలలు యీ పఠనమందిరాలు...వీటన్నిటికీ ప్రభుత్వం సగం డబ్బు యిచ్చింది. సగం మన వూరివాళ్ళు శ్రమదానంగాను డబ్బురూపంగాను యిచ్చారు. అన్నిటికీ మన డబ్బే అయిపోయిందని భ్రాంతి పడ్డారు మీరు.

జమీం:— అవునమ్మా అవును! ఆ ఆవేశంలో వాడిని బదులాడ నీయకుండా నోరు కట్టేశాను. పాపం యేదో చెప్పవస్తుంటే నోరు మూయమన్నాను. అల్లారుముద్దుగా యెత్తి ముద్దులాడిన యీ చేత్తోనే చెంపమీద కొట్టి కట్టుగుడ్డలతో బైటకు నెట్టివేశాను.

ప్రేమ:— మన డబ్బంతా అన్నయ్య Factory లో పెట్టాడు. దానికి ప్రభుత్వంకూడా సాయం చేసింది. దానిమీద యెంతో లాభం వచ్చింది కూడా!

జమీ:— అవునమ్మా! అవును. వాడు ఉత్తమమైన వాడు. వాడు నన్ను యెన్నటికైనా క్షమిస్తాడా? నా ముఖం చూస్తాడా?

ప్రేమ:— అదేమిటినాన్నా? అలా అంటారు? అన్నయ్య సంగతి మీకు తెలీదా? మీకు తిరిగీ యెప్పుడు అనుగ్రహం కలుగుతే అప్పుడే మీపాదాల దగ్గరకు వచ్చి వాలుతానని చెప్పి మరీ వెళ్లాడు.

జమీ:— నాకు తెలుసు. బంగారు కొండ వాడు. ఇదిగో యిప్పుడే......యిప్పుడే వెళ్తున్నాను...... నా బాబును ...... నా చిట్టితండ్రిని యిప్పుడే తెస్తాను...... యింటికి.........యిప్పుడే.........

—తెర—

---

# 13వ రంగము.

[రాత్రి 7 గంటలు. మహిళామండలి కార్యాలయం. ప్రేమ కుర్చీలో కూర్చొని పాట పాడుతుంటుంది. శాంతి పాటకు తగినట్లు నృత్యం చేస్తుంటుంది.]

ప్రేమ:— ప॥ చల్లటి రాతిరి వెన్నెల వెలుగులో
హాయిని గూర్చే ఓ చందమామా ॥నా చందమామా॥

అ॥ తారనుచేరగ పాపము కాదా
తాపము తీరగ ధన్యుడ వైతివా!
మగువల మనసుల మర్మమెరుగవా
మమతలు వనితల వస్తువు కాదా ॥చ॥

చ॥ జిలిబిలి చేష్టలు చిలిపి చూపులు
గిలిగింతలుగా కలయించెనురా
చాలు చాలు యిక సద్దుగ పోరా
అలయించెను రా ఆపలేనురా ॥చ॥

ప్రేమ:— శాంతీ!

శాంతి:— ఏమిటమ్మా?

ప్రేమ:— ఏమీ లేదమ్మా! నిన్ను పరీక్షకంపేటప్పుడు నాకు యే మాత్రము ధైర్యం లేకపోయింది. మెట్రిక్ అంటే అందరూ గజనీలాగ దండయాత్రలు చేస్తారు, పట్టుమని పట్టుబట్టి రెండేండ్లు చదివావోలేదో ఫస్టున పాసయ్యావు చాలా గడుసు దానవు సుమా!

శాంతి:— అంతా మీ దయేకదమ్మా! శాంతికి ధైర్యస్థైర్యాలు శౌర్య సామర్థ్యాలు అన్నీ చేకూర్చేది ప్రేమే కదమ్మా!

ప్రేమ:— ఔను ఔను ప్రేమ లేనిదే శాంతికి తావులేదు. ప్రేమ అండవుంటే శాంతికి విజయకాంతి కలుగుతుంది. అయితే శాంతీ! శాంతి లేనిచోట భద్రం వుంటుందంటావా?

శాంతి:— శాంతిలేనిచోట భద్రమెలా వుంటుందమ్మా? ప్రేమమీద శాంతి శాంతిమీద భద్రం యీవిధంగా ఒకదానిమీద ఒకటి పరస్పరం ఆధారపడి యున్నాయి.

ప్రేమ:— శాంతీ! యిప్పుడు మన గ్రామంలో కలిగిన మార్పు చూస్తుంటే మనస్సు ఆనందంతో పొంగిపోతూంది.

శాంతి:— ఔనమ్మా! మీ అన్నాచెల్లెళ్ళ ధర్మమా అని గ్రామంలో ధర్మం నెలకొల్పబడింది. అన్ని సదుపాయాలూ సమకూరాయి.

ప్రేమ:— ఓహో! మీఅన్నాచెల్లెళ్ళు యేమీ చెయ్యలేదన్నమాట!

శాంతి:— మీ త్యాగంముందు మేము చేసింది ఒక లెక్కలోనిదంటారా?

ప్రేమ:— అదేమిటి శాంతీ! నీవేగా అన్నావు? అందరం చేయి చేయి కలిపితేగాని అభ్యుదయం రాదు అని. అందరం కలిసి కష్టపడబట్టే మన కష్టాలు గట్టెక్కాయి. ఈ అభ్యుదయం చూస్తుంటే మనస్సు యెంతో తేలికగావుంది. కాని శాంతీ! నా మనస్సు యెంతో బరువుగా వున్నదిసుమా!

శాంతి:— అదేమిటమ్మా? మనస్సు యెంతో తేలికగా వున్న దన్నారు. మళ్ళీ మరుక్షణంలోనే మనస్సు అంత బరువు యెలా యెక్కిందమ్మా?

ప్రేమ:— శాంతీ! ఈ వాతావరణం యెంత ప్రశాంతంగా వున్నదో చూశావా! ఈ వెన్నెల, ఈ జాబిలి ఈ చల్లని మలయ పవనాలు యీ పూలతావులు .... ఆహా! సుధాకరుడు ప్రేమ కారకుడు కదా! తన చల్లని వెన్నెలతో జగత్తు నంత ముంచి వేస్తున్నాడు,

శాంతి:— సుధాకరుడు ప్రేమ కారకుడే కాదమ్మా! ప్రేమమయుడు కూడాను. సుధాకర ప్రేమల అన్యోన్యానురాగం అంతింత అని వర్ణింప నలవిగాదు సుమండీ!

ప్రేమ:— శాంతీ! నీవు రానురాను భావకవయిత్రివై పోతున్నావు సుమా! శాంతి! ఇన్నాళ్ల గ్రామనిర్మాణ కార్యకలాపాలలో మునిగిపోయిన మనస్సు మన జీవిత తపస్సునే మర్చి పోయింది.

శాంతి:— ఏమిటమ్మా మీరనేది?

ప్రేమ:— శాంతీ మనమూ మనుష్యులమే కదా ?

శాంతి:— అవునమ్మా! అందులో అనుమానమేముంది ?

ప్రేమ:— మనకూ ఆకలిదప్పులు వున్నయ్యంటావా ?

శాంతి:— లేకేమమ్మా!

ప్రేమ:— అలాగే మనకూ మనోవికారాలు కలుగుతే మనం సిగ్గు పడవలసింది యేముంది? అది ప్రకృతి సహజం. చంద మామ చల్లగ నుండడా? మలయ పవనుడు మనసుకు హాయిని గూర్చడా? వీటన్నిటి లాగానే మగువకు...

శాంతి:— అవునమ్మా! మగువకు మగవాడి తోడుండాలి. అప్పుడు గాని జీవితం నిర్మలప్రేమతో భూలోక స్వర్గంలాగడిచి పోదు. మీముందు దాపరికం యెందుకమ్మా? నాకూ ఒక నచ్చిన పురుషుణ్ణి పెండ్లి చేసుకుని హాయిగ కాలం గడపాలని వుంది.

ప్రేమ:— అయితే తప్పకుండ అతన్ని వివాహం చేసుకో!

శాంతి:— అది అంత సులభమా అమ్మా?

ప్రేమ:— ఏం? ఎందుకు కాకూడదు?

శాంతి:— నాకు నచ్చిన వ్యక్తి నన్ను మెచ్చుకోవద్దా అమ్మా. మీ కేమమ్మా! జమీందారు గారి ముద్దుల కుమార్తెలు మీరు యెవర్ని వరిస్తే వారు మిమ్ము లను తలమీదధాల్చి పూజిస్తారు. కాని మేమా పేదవాళ్ళం వేనకువేలు కట్నాలు యిచ్చుకోగలమా? అడిగిన లాంఛనాలు తీర్చగలమా?

ప్రేమ:— ఆదేమిటి? పిచ్చిపిల్లా! కట్నాలయుగం గడిచిపోయింది. ఃస్వార్థ నిర్మల ప్రేమ వున్నచోట ధనం ఒక సాధనంగా పనిచెయ్యలేదు. ఇంతకూ, యింతకు ముందేగా అన్నావు! శాంతి భద్రాన్ని వరిస్తుందని.

శాంతి:— శాంతి భద్రాన్ని వరించవచ్చు. కాని భద్రం శాంతికి లొంగవద్దూ?

ప్రేమ:— లొంగకేం? శాంతివల్ల సాధించలేనిది యేముంది? ఈ అణ్వస్త్ర యుగంలోకూడ మన నెహ్రూ పండితుడు ప్రపంచం నలుమూలలా తన శాంతి ప్రభావాన్ని ప్రస రింపజేసి "శాంతిదూత" అని పేరుపొందలేదా? ఆ మహాత్ముని శాంతి సందేశమేకదా గడపదగ్గరకు వచ్చి యున్న మూడవ ప్రపంచ యుద్ధాన్ని మూలకు నెట్టి వేసింది!

శాంతి:— అమ్మా! అయితే అలాగె ప్రేమా సుధాకరుల ప్రణ యానురాగం మాత్రం అవిచ్ఛిన్నంగా వుండదా మరి?

ప్రేమ:— అయితే అవొచ్చు.

శాం:— ప్రేమను రేకెత్తించటం సుధాకరుని స్వభావం. ఇక ప్రేమకు ప్రణయమూర్తి సుధాకరుడు.

ప్రేమ:— శాంతీ మనమన మనసులలోని మమతలు మనకు తెలి యనివికావు. కాని మన పెద్దలుకూడ మనముద్దులు

తీరి స్తే యెంత బావుంటుంది? (భద్రం సుధాకరులు ప్రవేశింతురు)

భద్ర:— అమ్మ దొంగల్లారా! యిక్కడేం చేస్తున్నారు?

ప్రేమ:— అన్నయ్యా! శాంతిది .... యేదో ... యెవరో దొంగిలించారట అన్నయ్యా!

భద్ర:— ఆ!...నిజంగానా శాంతీ!

సుధా:— నిజమేనా చెల్లీ?

శాంతి:— [మాట్లాడదు. సిగ్గుపడుతుంది.]

భద్ర:— ఏం శాంతీ మాట్లాడవు?

శాంతి:— నిజం చెప్పమంటారా? ప్రేమమ్మగారిదే...యెవరో... యేమో దొంగిలించారట బాబూ!

సుధా:— ఏమిటి శాంతీ యీ దొంగతనాలు?

ప్రేమ:— అన్నయ్యా! శాంతి మనసు భద్రం దొంగలించాడట అన్నయ్యా!

సుధా:— అదేమిటి శాంతీ! తప్పుగదూ!

శాంతి:— అది నా తప్పేకాదు. ప్రేమ మనసు సుధాకరుడు దొంగిలించాడట అన్నయ్యా!

సుధ:— ఆ!? !!!

భద్ర:— ఓహో! మొత్తానికి దొంగలిద్దరూ చేరి. ఇద్దరి మనస్సు లనూ దొంగలించారన్నమాట. అమ్మాయీ ప్రేమా! మీ మనసులు మాకు అర్థం అయినవి. సంఘసేవలో యిన్నాళ్లూ మనల్ని గురించి ఆలోచించుకోలేదు. సుధా కరుడు ప్రేమమూర్తి. నిస్వార్థజీవి. నీ జీవితం ధన్య మయిందమ్మా!

ప్రేమ:— శాంతి మాటోమరి?

భద్ర:— శాంతి మనస్సు వెన్నలాంటిది. శాంతి నిస్వార్థజీవి. నిష్కల్మషం ఆమెహృదయం. ఆమెకు నా హృదయంలో తప్పకుండ స్థానం వున్నది.

శాంతి:— (సిగ్గుతో కూడిన సంతోషాన్ని ప్రదర్శిస్తుంది.)

ప్రేమ:— మరి నాన్న మనకోరికలు తీరుస్తారంటావా అన్నయ్యా?

భద్ర:— నాన్నగారు మన పనులకు అడ్డు చెప్పలేదు. పైపెచ్చు మెచ్చుకున్నారు. తప్పకుండా మనల్ని ఆశీర్వదిస్తారు. ఎంతో ఆనందిస్తారు కూడా! నాకు ఆ నమ్మకముంది.

ప్రేమ:— అమ్మయ్యో! చాల పొద్దు పోయిందన్నయ్యా!

భద్ర:— అవును, నాన్నగారు మనకోసం కాచుకుని వుంటారు. వెళదాం పదండి.

ప్రేమ:— రా శాంతీ వెళ్దాం! —తెర—

# 14వ రంగము

[ జమీందారుగారి మేడ. ఉదయం యెనిమిది గంటలు. జమీందారుగారు అప్పుడే నిత్యకృత్యాలు తీర్చుకొని వచ్చి వరండాలో వేసియున్న పడక కుర్చీలో కూర్చొని యుంటారు. నౌకరు రాముడు దినపత్రికను తెస్తాడు. దానిని సురేష్‌కు యివ్వమని సంజ్ఞ చేస్తాడు జమీందారు. ]

జమీం:— పత్రికలో Head Lines ఏమున్నయో చదువుసురేష్!

సురే:— 'రష్యాలో అణ్వస్త్రాల పరిశోధన — భారత నాయకుల కలవర పాటు!

జమీం:— రామచంద్రప్రభో! ప్రాక్పశ్చిమ దేశాలలో యీ మారణాయుధాల పరిశోధన దారుణంగా పెరిగి పోతూంది.

సురే:— 'సరిహద్దు సమస్యపై చైనావారి గడబిడ — యుద్ధానికి సంసిద్ధత'.

జమీ:— యుద్ధమా?!....ఏమీ? తిరిగీ యుద్ధమా? యుద్ధానికి యికమీదట ప్రపంచంలో యేమాత్రం స్థానంలేదు. సామ్రాజ్య విస్తరణకోసం అమాయక ప్రజల జీవితాలను ఆహుతి గొంటారా? యుద్ధం రాదు...రాబోదు...రాకూడదు.

భద్ర:— (ప్రవేశించి) రాకేంజేస్తుంది నాన్నగారూ?

జమీం:— ఎందుకొస్తుంది నాన్నా?

భద్ర:— ప్రజలు శాంతి ప్రేమల కోరికలు మన్నించనంతకాలం యుద్ధం యెలా తప్పుతుంది?

జమీ:— ప్రజలదేముంది నాయనా? వారు ఒట్టి అమాయకులు. తప్పకుండా వారు శాంతి ప్రేమలను ఆహ్వానిస్తారు. వారి కోరికలు మన్నిస్తారు. యువతీయువకులంతా నడుము కట్టండి. శాంతి సౌధాన్ని నిర్మించండి నాయనా!

భద్ర:— నాన్నా! శాంతి భద్రాన్ని వరించి వుంటుంది కదూ!

జమీ:— అవును తప్పకుండా భద్రానికి శాంతి అవసరం. శాంతి తోనే ఉన్నది భద్రం, ఆనాడే విశ్వకల్యాణం.

భద్ర:— మరి ప్రేమో!

జమీ:— అవును. శాంతి సౌధానికి పునాదే ప్రేమ. ప్రేమలేని శాంతి యెంతకాలం వుంటుంది నాయనా?

భద్ర:— నాన్నగారూ! శాంతిప్రేమలయెడల మీకుగల అనురాగం అపారం. వారి కోరికలు చెల్లించడం విశ్వకల్యాణానికే మూలాధారం కదా!

జమీ:— ముమ్మాటికీ అంతే!

భద్ర:— అయితే మీరు చెల్లిస్తారా నాన్నా శాంతి ప్రేమల కోరికలను.

జమీ:— తప్పకుండా! నేనేకాదు. తెలివి తేటలుగల యే వ్యక్తి అయినా చెల్లించి తీరుతాడు.

భద్ర:— అయితే సోమన్న కూతురు శాంతి నెరుగుదురా నాన్నా?

జమీ:— ఎరగకేం? మన పనిమనిషి శాంత! మన పిల్లితో కలిసి మెలసి తిరుగుతున్నది ఇప్పుడు Matric కూడ Pass అయిందట కదూ?

భద్ర:— అవును నాన్నా! ఆ శాంతి మీ కుమారుడు భద్రాన్ని వరించింది నాన్నా!

జమీ:— ఆ!...అరి పిడుగా! శాంతి భద్రతలని మాటలలో ఆడిన చెలగాటానికి యిదా అర్థం? నాయనా నేనుమాత్రం మీముద్దు తీర్చక యేంజేస్తాను. తెలివైన పిల్ల, అందమయింది. నిర్మలమయిన మనస్సుగలది. అవన్నీవుంటే యీకులమని గోత్రమని కూర్చుంటే మాత్రం జరిగేది యేముంది? మనస్ఫూర్తిగా మిమ్మల్ని ఆశీర్వదిస్తున్నాను. ఇప్పుడే శాస్త్రిలవారిని పిలిపించి ముహూర్తం పెట్టిస్తా. ఆ అన్నట్లు పనిలో పని, ప్రేమకుకూడ యెవరన్నా బుద్ధిమంతుడైన కుర్రవాడు దొరికితే బావుండును.

భద్ర:— ప్రేమకూడ తన వరుణ్ణి తావే వెదుక్కుంది నాన్నా!

జమీ:— ఎవరూ ఆ అబ్బాయి?!...

భద్ర:— మన సుధాకర్ నాన్నా!

జమీ:— మన సుధాకరుడా? భేష్! నా కడుపున పుట్టి నందుకు మీ రిద్దరుకూడ దేశానికి ఆదర్శ మూర్తులై పోయారు. ప్రేమకు కావలసింది 'డబ్బుకాదు—మనస్సు' అని లోకానికి చెప్పారు.

భద్ర:— అంతా మీ ఆశీర్వాదబలం నాన్నా!

జమీ:— చాల ఆనందం నాయనా! ఈ సమయంలో మీ అమ్మే వుంటే ఎంత సంతోషించేదో! (కండ్లు తుడుచుకొనును). అయినా పైనుండి మీమీద ఆమెఆశీర్వాదాలు కురిపిస్తూనే వుంటుంది. ఒకరినొకరు ప్రేమించుకొన్నారు. కలిసిమెలిసి పనిచేశారు. అందరూ మీలాగే ఆదర్శమూర్తులైతే కష్టాల బాధ విరుగడైపోయి దేశం బాగు పడుతుంది.

మీరు సాధించిన సుభిక్షత నిజంగా అపురూప మయింది. ఏదేశంలోనూ యింతవరకూ యెవ్వరూ చేయ లేని ఘనకార్యం!

భద్ర:— అంతా పంచాయతీ పరిపాలనా మహాత్మ్యం నాన్నగారూ!

జమీ:— అవును. పంచాయితీ రాజ్యమే శ్రేయోరాజ్యం, అందులో స్వార్థానికీ, సంకుచితత్వానికీ తావులేదు. ఆ! ... సురేష్! వెంటనే సిద్ధాంతిగారిని పిలిపించి ముహూర్తాలు సిద్ధం చేయించు.

సురే:— అలాగే బావా!

జమీ:— భద్రిం! లే నాయనా! వెళ్లుదాం. ఈ నాటికి దేశంలో శాంతి భద్రతలు నెలకొన్నాయి. ఏ కొరతాలేకుండా అందరూ ఆనందంగా వున్నారు. పంచాయితీ రాజ్య ప్రభావం.

రాముడు:— పంచాయితీ రాజ్యానికీ ... జై!

మంగళం.



శ్రీ బాలాజీ బైండింగు అండ్ ప్రింటింగ్ వర్క్సు, అనంతపురం.